శ్రీ

# రాధాకృష్ణనాటకము.





ఇది

పాదుకాపట్టాభిషేకము, విప్రనారాయణ

మొదలగు నాటకములు రచించిన

## పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే

రచియింపఁబడినది.




పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య,

సత్యనారాయణబుక్కుడిపో,

రాజమండ్రి.

ఆరవకూర్పు 2000 ప్రతులు.

కాకినాడ.

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.





1929.

[వెల 0—12—0.

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.



## పురుషులు.

కృష్ణుఁడు—కథానాయకుఁడు.

శారదుఁడు—కృష్ణుని మిత్రుఁడు.

నారదుఁడు—ముని.

ముని బాలకుఁడు—

## స్త్రీలు.

రాధ గోపిక—కథానాయిక.

లలిత, మధుర } రాధ చెలికత్తెలు.

సత్యభామ—కృష్ణుని భార్య.

తరళ—సత్యభామ పరిచారిక.



శ్రీ

# రాధాకృష్ణనాటకము.



## నాంది.

ఉ. చెంతకు లాగి యక్కునకు । స్వీయగుణంబునొసంగు నాయయ
స్వాంతము భాతి భక్తజన । సత్తమచిత్తముఁ బట్టిలాగి త
త్స్వాంతము స్వప్రమోదభరితంబుగఁ జేసెనునల్ల రాధికా
స్వాంతవిహారి కృష్ణుఁడు కృపామతి మీకిడు నిత్యసౌఖ్యముల్.

[నాంద్యంతమందు సూత్రధారుఁడు ప్రవేశించి]

సూ—(తనలో) ఎన్నాళ్ళకిట్టినాటకము చదువుభాగ్యము నాకులభించెను! చదివినమాత్రముననే భక్త్యావేశముచేఁ బులకితాంగుఁడనై యానందబాష్పపూరితలోచనుండనైతిని. ఇంకఁ బ్రదర్శితమైనచో నీనాటక మెట్లు శోభిల్లునో నేఁ జెప్పఁజాలను.

గీ. కలియుగముమాట మఱచి నా । కాంత మఱచి
మఱచి నాదైనపురుషజ । న్మంబుకూడ
వింతగా నేను రాధికా । కాంతనైతి
నవని గ్రంథంబు చేయలే । నట్టిదేది? K.C.

నటి—(ప్రవేశించి చిఱునవ్వుతో) ఆర్యపుత్రా! మీరు మఱచినను నేను మఱవనీయను. స్త్రీలఁ బురుషులుగాఁ జేయుస్వభావము కూడ మీనాటకమున కున్నయెడల బాధలేదు కాని లేనిచోఁ దమసౌఖ్యమునకు నాసౌఖ్యమునకుకూడ భంగముగాఁదోఁచుచున్నది. అయిన నిట్టివిచిత్రప్రభావము గలనాటక మేదియో, కవి యెవరో దయచేసి చెప్పవేఁడెదను.

సూ—సమయమునకు వచ్చితివి. మన మిదివఱకే మధ్వవంశసంజాతుండును, శ్రీవత్సనగోత్రుఁడును, శ్రీవేంకటరమణార్యరత్న

మాంబాపత్రికమపుకుత్రిం కునా, నర్మదాపురుకుత్సీయ, సారంగధరచరిత్ర, ప్రచండచాణక్యనాటకత్రియ విరచనాచణుండును, ఆంగ్లేయభాషానిపుణుండును, నవనకవితాసంపన్నుండును నగు పానుగంటి లక్ష్మీనరసింహారావు నెఱుంగుదుము గదా! తన్నాటకముల సభారంజకములుగాఁ బెక్కుసారు లాడియుంటిమి. ఇది యాయన చతుర్థనాటకము. దీని నిప్పుడు ప్రయోగింప నుద్యోగించితిని.

నటి—పే రేది?

సూ—రాధాకృష్ణ నాటకము.

నటి—శృంగారరసప్రధానమా?

సూ—శృంగారరసమునకు ముద్దుఁజెల్లెలైన భక్తిరసము ప్రధానముగాఁ గలదు.

నటి—సరి. సరి. తేజస్తిమిరములవలెనుండు భక్తిశృంగారములు సోదరు లెట్లగును? జారిణీశిఖామణి యనఁబఱఁగు రాధ భక్తజనగ్రామణి యెట్లగును?

సూ—ఓసీ! ఇటు విను.

గీ. కాముకులకూర్మి శృంగార । నామకంబు
భక్తియగునదె దైవంబు । పైని బెట్టఁ
బాలఁతితలఁబెట్టు సుమము ముద్దులకుఁ దగును
దైవనిర్మాల్యమేని వంద్యమగు నదియె.

నటి—మఱి రాధాకాంతమాట యేమి చెప్పెదరు?

సూ—ఇఁక రాధ జారిణియనుమాట కేవలమూఢాభిప్రాయము. ఈ సత్యము మన మాడఁబోవు నాటకమే ప్రకటించుచున్నది. అదియునుంగాక,

క. కలికికి వలపులమగనికిఁ
గలసౌఖ్యముకంటె మోద। కర మొండిలలోఁ
గలదే? కావునఁ గవి యా
వలపునకుం బోల్చి చెప్పె। భక్తులభక్తిన్.

చ. తనువు గృహంబునందునను। ధ్యానము వేఱొక దిక్కునందు నుం
చును, స్వసుఖంబు లేశమును। జూడదు, నిద్దురఁబోదు, మానహా
నిని భరియించు నుద్వేజన। నిందకుఁ గేలికి జంక దిట్టయై
ద్రిమిఁ బ్రకటించు స్వైరిణిని। మించును భక్తుఁడు దైవభక్తిలోన్.

పామరజనహృదయానుభూతంబులగు వానిలో జారజారిణీసంబంధ సం
భూతసౌఖ్యంబుకంటె నైహికామోదకరంబు వేఱొండు లేమిం
జేసి కవులచే నది యుపమానముగాఁ దేఁబడెను. గాని భక్తి
జారత్వము కాదు; భక్తురాలు జారిణియుఁ గాదు.

నటి—నాసందేహములు తీఱెను. ఇట్టివిమలభక్తిప్రతిపాదకమైన నా
టకమా! యీ చతుర్థనాటకము?

సూ—అట్టిదే

గీ. స్థూలసూక్ష్మకారణపర। తుర్యతత్త్వ
మీకథకు నాయకమణి సం।సృతివిపన్న
తారకచతుర్థపురుషార్థ। దాయకంబు
బోఁటి! యిపుడాడెడుచతుర్థ। నాటకంబు.

నటి—అట్లైన మీకు సహకారిణినిగానుండి మీయుద్యమము నిర్వి
ఘ్నముగాఁ గొనసాగించుటకు నామనస్సు కుతూహలపడు
చున్నది.

సూ—తథాస్తు.

గీ. అడుగకయె యర్థి కొసఁగిన। యట్లు మగనిఁ
గోరకయె కాంతఁ గాఁగిటఁ। గూర్చినట్లు

నే నడుగకుండ నీయంత । నీవు వచ్చి
"నీకుఁ దోడ్పడుదు" ననుట । నీరజాక్షి.

నటి—(నవ్వుచు) బాగుగ నున్నది. మీరు దెచ్చినపోలిక భక్తిశృంగారములకుఁ బరస్పరసంబంధ మున్నటు లమోఘదృష్టాంతముగాఁ బోలు.

సూ—ఆలస్యమగుచున్నది. మన మిఁకఁ బోవుదము. రాధాకాంత భక్తివంటిభక్తితో మన మీనాటకముఁ బ్రదర్శింపవలెను.

నటి—దానితోఁ గూడ సలలితోత్తమశ్రద్ధావివేకముల జతసేయవలెను.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)





శ్రీ

# రాధాకృష్ణనాటకము.



## ప్రథమాంకము.

ప్రదేశము:—బృందావనము

[రాధ, లలిత ప్రవేశించుచున్నారు.]

రాధ—లలితా! నీకు శ్రద్ధయున్నంత తెలివి లేదు సుమా!

లలి—ఇది మీరొక్క రనినమాటయే కాదు. సిరి హెచ్చినకొలఁది దాతృత్వము తగ్గినటులు, దాతృత్వ మధికమైనకొలఁది సిరి తగ్గినటులు శ్రద్ధావివేకములకు విపర్యయసంబంధము కాదా?

రాధ—అదేమిమాట? సంపూర్ణశ్రద్ధావివేకము లొకచోటనుండవా?

లలి—ఉండినఁ జెప్పవలసిన దేమున్నది? అదియే భూలోకస్వర్గము; రాధాకృష్ణదాంపత్యమువంటిది.

రాధ—దాంపత్య మెచ్చటిది? నాకట్టినిరంతరసేవాభాగ్యముకూడనా!

లలి—(తనలో) అది లేకపోవుటచేతనే యీ యమితానురాగము.

రాధ—ఏమి గొణుగుకొనుచున్నావు?

లలి—నేను మందబుద్ధి నని యధిక్షేపించిన నీకు మఱపు గలిగినదని.

రాధ—ఏమి?

లలి—నా తెలివితక్కువ యేదో చెప్పవైతివి!

రాధ—తెలివితక్కువయా? మతిశూన్యతయా? ఏమిపనిఁ జేసితివి? చాలు!

లలి—(తనలో) నీచెలినైన నాకిది యాశ్చర్యము కాదు. (ప్రకాశముగా) అమ్మా! అటు లంటివేల ?

రాధ—ఇటు రా. ఇటు రా. తెలివితక్కువయన్న రోషమా ! ఇది యేమి? పరువునకు రాని శితాగ్రియు లగుజాజి మొగ్గలు దెచ్చి, నా నాథుని యాకుసుమశయ్యపై దాపితివి గదా? శిరీషకుసుమ సుకుమారతరుఁడగు నానాథునిదేహమునకివి గ్రుచ్చుకొనవా?

లలి—(పెద్దనవ్వు నవ్వుచు) అప్పటి కవి నీముఖకమలములతోడను హృదయముకుళములతోడను, సంపూర్ణముగ వికసించు నని యటులు చేసితిని.

రాధ—ఏమి యంత వెఱ్ఱినవ్వు నవ్వితివి ?

లలి—మతిలేనిదానికి వెఱ్ఱిన వ్వాశ్చర్యమేమి ?

రాధ—చేసినది తప్పైనప్పు డొప్పుకొనఁ గూడదా ? దానికి వంక రొకటియా ? కాని, యీసెజ్జపై రెండుపూలచెండ్లు నుంచు మని చెప్పలేదా ? అది యేల మఱచితివి ?

లలి—అది జ్ఞప్తియుండియే మఱచితిని.

రాధ—ఆఁ! అసందర్భప్రలాపములు గూడనా ?

లలి—ఇంక నేమి రావలసి యున్నదో !

రాధ—పూలబంతులమాట జ్ఞప్తియుండి మఱచుట యేమి ?

లలి—నీ వాతనియొద్దనే యుందువని యుపేక్షించితిని.

రాధ—ఈ మాధవీనికుంజ మంధకారయుతముగ నున్న దేమి ?

లలి—(నవ్వుచు) నీనాథుఁ డింక రాకపోవుటచేత.

రాధ—ఆఁ! నాప్రాణనాథుఁడు నల్లనివాఁడని పరిహాసించు చుంటివా? నీకుఁ గన్నులు లేవా? పరిశీలనము లేదా? అంతదివ్యమంగళ విగ్రహమును గాంచలే దని నారదుఁడు ప్రసంగించినపుడు నీ చెవులు చిల్లులువడెనా? నోటికి వచ్చినట్లు వదరెదవా? నల్లని

వాఁడేమి? ఆఁ! అనిర్వాచ్యమై యనేకచంద్రప్రభాభమైనయొక దివ్యతేజ మామహామహుని మూర్తియందుఁ బ్రకాశించుచున్నట్లు నీకింతకాలమునుండియును గనఁబడ నేలేదా? కన్నులు లేనిదాని కంధకారదర్శనముగాక మఱేమున్నది!

లలి—(లేచి వెళ్ళఁబోవును.)

రాధ—ఆఁ! వెళ్ళెదవేమి?

లలి—నే నిక్కడనున్న ప్రయోజనము లేక.

రాధ—ఎందుచేత లేదు?

లలి—నే ననుమాటలు నీవు విని మాటలాడుచుండినఁ బ్రయోజనము లేకేమి? నేను పలుకనిమాటలపై నీవు తలతోఁక లేని వ్యాఖ్యానముఁ జేయుచున్నప్పుడు నే నిక్కడనే యుండవలె ననుమాటయేమి?

రాధ—ఆఁ, ఆఁ, ఇంతలో నసత్యమా? నీ వనలేదా?

లలి—ఏమని?

రాధ—"నీనాథుఁడు వచ్చిన వెలుతురున కేమిలోటు?" అని.

లలి—నిన్నరాత్రి యాగిరిమండలముపైఁ జంద్రుఁడు, నీగిరిమండలముపై గోపాలుఁడు నొక్కసారిగా నుదయించిరి కదా? ఈరాత్రి గూడ నావేళకే నీనాథుఁడు వచ్చునని.

రాధ—నిన్న నేమి జరిగినదో నాకు జ్ఞప్తి లేక యటులంటిని. పోనీ! చంద్రోదయసమయ మాసన్న మగుచున్నది కాఁబోలును. నన్నలంకరించెదవా? చూడు! లలితా! ఈతెల్లనిచీర వెన్నెలలో శృంగారముగ నుండునా?

లలి—నీవు నీనథునిమూర్తిని సమీపించినపుడు గంగాకళిందజాసంగమమువలె మఱింత శోభించును.

రాధ—అదిగో! నాప్రాణవల్లభుని నైల్యమునే తిరిగి యుద్ఘాటించుచుంటివి. దర్పణ మిటు తెమ్ము. (లలిత తెచ్చుచున్నది.)

రాధ—(అద్దమందుఁజూచుచు) లలితా! ఈకస్తూరితిలకము ముఖము పై నీఁగ వ్రాలినట్లున్నది. దీనిని బన్నీటఁ దుడిచి సన్నగా పోఁగగా భ్రూమధ్యమందుండి పాపటబొట్టువఱకు గోరోచనమును గుంకుమపువ్వును గలిపి మందారకుసుమములోని కేసరశలాకవలె నూర్ధ్వతిలక మందముగ దిద్దుము.

లలి—విష్ణుభక్తిసూచక మగుటచే నీనాథున కది మనోహరముగ నుండును.

రాధ—లలితా! లోకు లేమనుకొనెదరో తెలిసికొనవలె ననికాదు సుమా! ఏమనుకొనిన నేమిచేయఁగలము? అయిన జను లేమనుకొనుచున్నారు? ఇదిగో! జడచుట్టు కుడివైపునకొరగినట్లున్నది.

లలి—(నవ్వుచు) రాధవంటిసౌందర్యవతి లేదని చెప్పుకొనుచున్నారు.

రాధ—నామాటనుగుఱించి కాదు.

లలి—నీనాథుఁగూర్చియా? అంతనవరసరసికుఁడు, నంతజనహృదయాకర్షణసమర్థుఁడు, నంతయాశ్రితవత్సలుఁడు, నంత సంగీతలోలుఁడు, నంతమాయలాఁడిదిపఱుఁ గలుగ లే దిఁకముందుఁ గలుగఁబోఁ డని పెద్దలు చెప్పుకొనుచున్నారు.

రాధ—అబ్బా! ఆతనిగుఱించి కాదు.

లలి—ఇఁక నన్నుఁ గూర్చియా?

రాధ—ఛీ! మాయిద్దఱి యైకమత్యమునుగూర్చి.

లలి—ఏమున్నది? అమ్మా! ఈసారి యద్దమును జూచుకొనుము! కర్ణాగ్రములం దుంచిన గన్నేరుపూవు లెగుడుదిగుడు లేక సరిగనున్నవా!

రాధ—లలితా! ఈగన్నేరుపూవులయరుణరాగము నా నేత్రములవెలుపలికొలుకులం బ్రతిఫలించి నన్నరుణలోచననుఁ జేయుటచే

దనపైఁ గోపగించితి నని నానాథుఁడు భ్రమపడునేమో!
వీనిని దీసివేయుము.

లలి—అటులైన రక్తాంతలోచనుండగు నీవల్లభునిఁ బోలియుందువు.

రాధ—పోలియుండుట తప్పు కాదా? అది నా కంగీకారము కాదు.
ఆతఁడు ప్రభువు. నేను దాసిని.

లలి—పోనిమ్ము. నల్లగలువల నంతునా?

రాధ—అవి చంద్రోదయ మగువెంటనే వికసించి చెవియంతయు
నాక్రమించి ప్రాణనాథుని వాగమృతముయొక్కయనుభవము
నకు విరోధముఁ గల్గుఁజేయునేమో! ఏవియు నక్కఱ లేదు;
కాని చెప్పఁబోయి యూరకున్నదానినిఁ జెప్పుము?

లలి—అదేది?

రాధ—మాయిద్దఱకుఁ జెందిన జనవాక్యసరణి.

లలి—రాధకు దేవకీనందనునిపై నిష్ట మని.

రాధ—అంతే? అంతే? ఇష్టమనియేనా? సామాన్యమైన యభిమాన
మనియేనా? సర్వత్ర చూడఁబడుస్నేహ మనియేనా? మహ
నీయులపై నుండఁదగినమొగ్గర మనియేనా? అంతకంటె హెచ్చు
గఁ జెప్పుకొనుట లేదా? రాధయొక్కప్రాణములు శ్రీకృష్ణు
నిలోనున్నవని చెప్పుకొనుటలేదా? తనప్రాణము, దనదేహము,
దనసర్వస్వము, నతనికిఁ ద్రికరణశుద్ధిగా నర్పణము జేసికొనిన
పరిచారిక నని చెప్పుకొనుట లేదా?

లలి—అటులు చెప్పవలసిన దని జనుల కిఁక బోధింతును.

రాధ—జనులవాక్యములతో మనకుఁ బని లేదు. ఆ మహామహుని
కున్న పదునాఱువేలభార్యలలో రాధకూడ నొకభార్యయే
యని చెప్పుకొనుచున్నారా? అందులోనైన నాకుఁ గొంత
యాధిక్యమును జను లాపాదించుచున్నారా? వలదు; చెప్పవల

దు. ఇదివఱకుఁ జెప్పినదేచాలును. కాని నీయభిప్రాయ మేమి?

లలి—ఇంతకుమును చెప్పలేదా? భూలోకస్వర్గమని—

రాధ—ఇది పరిహాసవాక్యము గాదు గద?

లలి—బుద్ధిమంతుఁడై, రాజవిద్యాపారంగతుఁడై సత్యవాక్యపరిపాలనైకదీక్షాదక్షుఁడై, కవితాభిమానియై, దేవబ్రాహ్మణభక్తియుక్తుఁడై, నవనవోన్మేషయౌవనప్రాదుర్భావసంపన్నుఁడైన మహారాజపుత్రుని రాజ్యలక్ష్మి వరించినటులు, శమదమాది సద్గుణసమాకలితుఁడగు భూసురేంద్రుని వేదాంతవిద్య వరించినటులు గోపాలరత్నమును నీవు వరించి నీ తనుహేమవల్లికమూల్యభూషణముగఁ జేసికొంటివి.

రాధ—దేహమునకుమాత్రమే కాదు సుమా?

లలి—ఈహారము లన్నియుఁ గంఠమందుంతువా?

రాధ—అబ్బ! కొంద ఱూరక గంగిరెద్దువలె దిగవైచికొందరు; కాని, నాకది యసహ్యము.

లలి—ఈతారహార మొక్కటి వైతువా?

రాధ—ఇది నిన్న వైచినదే కాఁబోలును. ఈరాత్రి యలంకారము నిన్నటిదానికంటె నింతగ నుండవలదా? ముందు కంచుకము బిగించితివికాదేమి?

లలి—ఆవశ్యకముకాదు. అది తనంతఁ దానే బిగించుకొనుచున్నది.

రాధ—ఉత్సాహముచేనుప్పొంగుచుంటినని హేళనమా?

లలి—చంద్రోదయారంభమున వారిధి యుప్పొంగుట నైజమేకదా?

రాధ—చూడు! ప్రాచీవదనము కలకల లాడుచున్నది.

లలి—నీవదనముకంటెనా? అభీష్టవస్తు వేదియో చెప్పవైతివేమి?

రాధ—చెప్పనా? శ్రీకృష్ణుఁడు.

లలి—కావున నీకృష్ణహారమును ధరింపుము.

(నీలపుఁదాళిఁ గంఠమున నుంచును.)

లలి — దేవీ! నయనానందకరముగఁ జంద్రోదయ మయినది.

రాధ — అబ్బా! ఎంతులకా జెప్పితివి? ఎవరికి నేత్రోత్సాహకర మైనను నాకుమాత్రము కాదు సఖీ! చంద్రుఁడును నామనఃకువలయ చంద్రుఁడు నొక్కసారి పొడచూపి రని చెప్పితివి కాదా?

లలి — అది నిన్నటిమాట.

రాధ — ఈరాత్రి చంద్రుఁడు శీఘ్రముగ వచ్చియున్నాఁడా? లేక, నా కాంతుఁ డాలస్యము చేయుచున్నాఁడా?

లలి — రెండును యథార్థము లే.

రాధ — ఆఁ! అదియెట్లు?

లలి — నీకాంతుఁ డాలస్యముఁ జేయుచుండుటచేతనే చంద్రుఁడు శీఘ్రముగ వచ్చినాఁడు.

రాధ — ఓ ద్విజరాజా! నానాథుఁ గూడ వెంటఁబెట్టుకొనిరాక నీవొక్కండ వేల వచ్చితివి? ఇది నీకుఁ దగునా? R.C

[శారదుఁడు ప్రవేశించును.]

శార — తగదని చెప్పనే చెప్పితిని. 'నీవు పో. నీవు పో' యని నన్నుఁ దొందర పెట్టఁగ వెడలి వచ్చితిని.

రాధ — భూసురచంద్రా! నీమిత్రమునకు నీతోఁగూడ వచ్చుట కవకాశ మేల లేకపోయెను? ఇంతరాత్రివేళను దన కేమిపని యుండును? ఇక్కడ కోవధీసునిరాకతో వత్తునని వాగ్దానముఁ జేసిన యాతని కిప్పు డాలస్యకారణ మేమి గలిగెను. ("దీనురాలగురాధ దేహమంతయుఁ గన్నులుగఁ జేసికొని నీకొఱకు చూచుచుండును; దానిని నిరుత్సాహపఱచుట దయాశూన్యత") యని నీవు ~~చెప్పలేకపోయితివా?~~ చెప్పిన నామహానుభావుఁడు లక్ష్యపెట్టకపోయెనా? ఏమాయలాఁడియైన నాదాక్షిణ్యస్వభావుని వలలో వెచికొని యాకర్షించుకొనిపోయెనా? నీ

విక్కడికి వచ్చునపుడు నానాథునిం జూచితివా? ఆతనితో మాటలాడితివా? ఆతనిముఖము ప్రసన్నముగ నుండెనా? మాటలాడవేమి? మాటలాడవేమి? నాకు విచారకరమైనవార్తయైనయెడలఁ జెప్పకుమా? అయ్యో? వినఁ దీరునా? చెప్పుము. ఎవతెయొద్దనైననసరే, నాకాంతుఁడు సుఖపరవశుఁడై యున్నాఁడని వినఁజాలును.

లలి—దేవీ! ఎందుల కీవెఱ్ఱితనము? ఆతఁ డిచటికి వచ్చుచునే యుండును.

రాధ—ఔను సుమా! వెఱ్ఱినై పలవరించితిని. నానాథుఁడు పరమదయాళుఁడు. నాయనురాగగాంభీర్యమును గుర్తెఱింగినవాఁడు. పరమస్వచ్ఛమైన నాయంతఃకరణవృత్తిని దరచినవాఁడు. తప్పక వచ్చెదనని వరమిచ్చినవాఁడు. అట్టి నాప్రాణప్రియుఁడు, నామనోదయితుఁ డిప్పు డుపేక్ష చేయునా? అసత్యము. అసత్యము. కాని యీబ్రాహ్మణుఁ డేల వచ్చెను? వచ్చి సందేహాస్పదమగు మౌనమును దాల్పనేల? ఓయయ్యా! నాహృదయవల్లభుఁడు నీతో వచ్చెద నని చెప్పెనా?

శార—నాతో వచ్చెద నని యాతఁడు చెప్పలేదు.

రాధ—హా! కృష్ణా! కృష్ణా! ఎంతమోసముఁ జేసితివి! సఖీ! నాకీయలంకారమును దీసివేయుము.

లలి—అమ్మా! తొందరపడకుము. అయ్యా! ఎప్పుడు వచ్చెద నని చెప్పినాఁడు?

శార—నావెనుక వచ్చెదనని చెప్పినాఁడు.

లలి—అమ్మా! వింటివా? ఆందోళనముతోఁ బనిలేదు. ఇంకను రాని వేళ గాలేదు.

రాధ—వచ్చువేళ దాఁటనేదాఁటినది కదా? రానివేళ యింకను దాఁట-

లేదని శుష్కసంతోషము నొందవలసినయోగము తటస్థించినదా! అయ్యో! నీవొక్కసాహాయ్యముఁ జేయవలసియున్నది.

శార—చేఁత నైనయెడల—

రాధ—నీపాదములకు మ్రొక్కెదను; పనిచెప్పితివని యాగ్రహింపకుము. నీవుపోయి నాకాంతుని వెంటఁబెట్టుకొని వచ్చి యీయార్తురాలిదుఃఖము నుపశమింపఁ జేయఁగలవా?

శార—శీఘ్రముగా నాతఁడే వచ్చును. ఇంతలో దుఃఖ మేల?

రాధ—క్షమింపుము; పొమ్ము. (శారదుఁడు పోఁబోవును) అయ్యో! ఆఁగు, ఆఁగు, ఆయనతో నేమిచెప్పెదవు?

శార—నాతో నేమియుఁ జెప్పలేదని చెప్పెదను.

రాధ—అయ్యో! అటులకాదు. చెప్పెద విను; విను! జాగ్రత్తగ వినుము. చూడు—రాధ—తెలిసినదా? స్వప్నమందైనఁ గాపట్యమనునది యెఱుఁగనిరాధ—అటవికకురంగివలె నమాయికయైనరాధ—అనురాగాంబునిధియైనరాధ—సర్వదాకరములు మోడ్చి తననామస్మరణముచేఁ గాలముఁ గడపుకొనుచుండు శుద్ధాంతఃకరణముగలరాధ—విశ్లేషమను మాటయేని సహింపలేనిగోల యగురాధ—తనకొఱకు బంధువులయాగ్రహమునకు, సాటివారిలోనినిందకు భాజనమైనరాధ—అభిమానవతికి భూషణమైనయభిమానమునహితముఁ దనకొఱకుఁ ద్యజించుకొని సర్వమును దానేయనిమనఃపూర్వకముగనమ్ముకొనిన బేలయగు రాధ—"బృందావనములోని కేలవచ్చితివి? కాన నీవు వన్నియక తప్ప"దని తానుబలుక "వ్యర్థురాలను; ధన మొసఁగలేను; ఈదేహము, నీయాత్మమాత్రము నాయధీనములు; నన్ను సాంగకముగఁ గృష్ణార్పణముఁ జేసికొనుచున్నాను గ్రహింపు"మని చెప్పి కృతార్థయైనరాధ — అట్టిరాధ—.

నావంటి రాధ — ఈరాత్రి నీకొఱకు— వినుచున్నావా? జాగ్రత్తగ వినుచున్నావా? సర్వాంగసౌందర్యమున జగన్మోహనుఁడవగు నీకొఱకు —ఆపన్నులమొరాలాపము లాలింపలేని నీకొఱకు—తప్పకవచ్చెదనని చెప్పిన సత్యశీలుఁడవైననీకొఱకు— సూర్యాస్తమయారంభముమండియిప్పటివఱకు —చూచితివా చంద్రుఁడెంతమీఁదికి వచ్చుచున్నాఁడో?— కనిపెట్టుకొనియుండి—పొంచియుండి —యెదురుతెన్నులుచూచుచుండి— నిరీక్షించుచుండి—

శార—అమ్మా! మీ కున్నమతి లేకపోవుట నాకు లేకపోవుటచేత నేనిన్నిమాటలఁజెప్పఁజాలను. మీరువ్రాసియిచ్చినయెడల కావడిమైన వైచికొని యీయసందర్భగ్రంథ మాయనకు సమర్పించి వత్తును. (తనలో) అబల కనురాగ మావృన కాముదపాకుకంటె నధికోన్మాదకరము గదా! ...

లలి—రాధా! మనసు కుదురువఱకు మఱొకటికొకటికి ?

రాధ—పోనీ! రెండుమాటలుమాత్రము చెప్పెదను. 'రాధ రమ్మన్న' దని చెప్పుము. వెళ్ళు. వెళ్ళు. శీఘ్రముగఁ బొమ్ము. అయ్యో! ఇంక నిక్కడనే యుంటివా?

శార—అమ్మా! ఒడిసెలలోఁ బెట్టి నన్ను విసరరాదా?

రాధ—అబ్బా! ప్రత్యుత్తరములఁ జెప్పుచు నాలస్యముఁ జేయుచుంటివి కదా? (శారదుఁడు నిష్క్రమించును.)

అయ్యో! భూసురోత్తమా! అనుగ్రహించి యొకసారిరమ్ము. లలితా! లలితా! నీవొక్కవరుగునఁబోయి యాతనిని బిలిచికొనిరమ్ము.

(లలిత నడచుచున్నది.)

అయ్యో— ఏమి యీమందయానము!

(లలిత శీఘ్రముగ నిష్క్రమించి శారదునితోఁ బ్రవేశించును.)

భూసురవర్యా! ఒక్కమాట చెప్పవలసి పిలిచితిని. "రాధ రమ్మన్నది." అని చెప్పుట యాధికారికాజ్ఞవలెఁ గనఁబడును. కావున, 'నీ కంగీకారమైనయెడల రమ్మని చెప్పిన బాధ యేమున్నది?

శార—ఎవరికంగీకారమైనపని వారుచేయుటకు నీయంగీకార మేల?

రాధ—అది గాక 'నీకంగీకారమైనయెడల' నన్నచో నాకంగీకారము కాదని ధ్వని యిచ్చునేమో!

శార—రావలదని వార్తనంపిన నేమి మునిఁగినదో యనియాందోళన పడుచు నొక్కనిమేషములో నాతఁడే పరుగెత్తుకొనివచ్చును. వెంకిపైఖరి గలమనుజుని కంతకంటె సౌఖ్యవార్త యుండదు.

రాధ—ఎంతమాటాడితివి! నాకొఱకు సంభ్రమముతో నాతఁడు పరుగెత్తుకొని వచ్చినయెడల నాయుపచారము నాపికదా? అమృతు లాంగుని పాదములు కందవా? వేఁడినిట్టూర్పుచే నధరబింబము వసివాడదా? వలదు. వలదు. ఆతనిఁ బిలువనే వలదు. నేనే యాతనియొద్ద కేఁగెదను. ఆతం డెక్కడనుండునో చెప్పెదవా? ఎఱుఁగుదువా? చెప్పఁగూడదా? మఱచిపోయితివా? నిన్నుఁ గూడ భ్రమపెట్టి తొలఁగెనా? అసత్య మాడకుమా? పలుకవేమి? నే నిబ్బందిపడుదు నన నీవు సంకోచించుచుంటివా? లలితా! ఊరకుంటివేమి? శారదా! మౌనవ్రత మేల?

శార—అమ్మా! మాకు నాలుకలు లేక—

రాధ—అదేల?

శార—మాజిహ్వలుగూడ నీవే తీసికొని యుపయోగించుకొనుటచేత.

లలి—అమ్మా! శాంతింపుము. వచ్చెదనని వార్తఁ బంపినయాతఁడు రాకుండునా? ఒక్కత్రుటికాల మూఱకుము.

రాధ—నాసంభ్రమ మాతనియాగమనమున కంతరాయముఁ గలిగించుచున్నదా?

శార—నీవు సంభ్రమించినందువలన నేయాతఁడు పరుగెత్తుకొనివచ్చునా!

రాధ—రాకపోయిన నేను జీవింతు ననుకొంటివా ?

లలి—అంతయుపద్రవ మేలకలుగవలెను ? అమంగళములఁ బలుకఁ దగునా ? ఆవేణుగానలోలుని—

రాధ—ఆఁగు ; ఆఁగు. ఏదియో మంగళధ్వని యగుచున్నది. అది నానాథుని కర్ణరసాయన మగువేణుగానరవము కాదా ? (అందఱు నాలకింతురు). అదిగో! తిరిగి వినఁబడ నోడటం పుల కాంకిత మగుచున్నది. లలితా ! నీకు వినఁబడుచున్న దా శారదా ! నీవుకూడవింటివా ?

శార—ఇది యనురాగభ్రమము. చెవిలో నిహూంకరును జెవి విని యాధ్వనికిఁ గారణము మఱియొకవస్తువని భ్రమింపదా ?

రాధ—అదిగో ! విను ; విను. నీపరిచారిక యిచ్చట నీకొఱకు వేఁచి యున్నది. ఇటు రా ; ఇటు రా.

శార—దేవీ ! ఎవరిని బిలుచుచుంటివి ?

రాధ—ఆగానముఁ జేయువా రెవరు ?

శార—నీమనసు.

రాధ—కాదు. నామనోనాథుఁడు ; అదిగో ! వినుము. ఇచ్చటిధ్వని మునుపటివానికంటె సమీపముగ వినఁబడుచున్నది. లలితా! నీవుపోయి నాకాంతుఁ డెంతదూరముననున్నాఁడో, మందముగ నడచుచున్నాఁడో, శీఘ్రముగ నడచుచున్నాఁడో చూచి వెంటనే రమ్ము. రావలదు. అక్కడనుండియే వచ్చుచున్నాఁడని కేకవేసి నీ వాతని నెదుర్కొనిరమ్ము. పొమ్ము. (లలితపోఁబో వును) ఆఁగు, ఆఁగు. లలితా! మనము సంభ్రమించి శ్రమిమి చ్చుచుంటిమని యాతనికిఁ దోఁచునేమో! అహా! ఆహా! మీకిప్పు డాకుసుమసుకుమారుని కంఠమందలి చంపకమాలిక ఘు

మ్మని పరిమళింపలేదా? శారదా! ఇప్పుడు మఱింత సమీపించు చున్నట్లు తోఁచుచున్నది.

శార — ఇదివఱకుఁ జెవివేటుదూరములోనున్నాఁడు. ఇప్పుడు ముక్కు వేటుదూరములోనికి వచ్చుటచేతఁ గంటివేటునకు మిక్కిలి దగ్గఱగ నున్నాఁడు.

రాధ — కాలిచప్పుడు వినఁబడుచుండ నిఁక సందేహ మేల? లలితా! అక్కడనుండి యొకసారి తొంగిచూడుము. నీవు వలదు. నీవు నా యలంకారము సమీచీనముగ నున్నదో లేదో చూడవలదా! అయ్యో! నీవు కొంచెము చూచిరమ్ము.

శార — అమ్మా! నాకుఁగూడ మతిలెగ్గుచున్నది. నాకుఁ దిరిగిరాకుండునట్లు సెలవిమ్ము పోయెద.

రాధ — నా వలన నీకింత కష్ట మేల? నేనే పోయి చూచెద. లలితా! నాయొడలు తూలుచున్నది. సమీపమందే యుండుము. (తొంగిచూచి వచ్చును.) ఏమిది! ఏమి! ఇప్పు డిచ్చటికి వచ్చినవాఁ డింతలో నెచ్చటికేఁ బోయెను! హా! రాధాకృష్ణా! లలితా! నాగోపాలకృష్ణుఁ డేఁడీ! నీవు చూడలేదా? శారదా! నామనోనాథుఁ డిప్పు డిటకు వచ్చినట్లు లేదా?

శార — సగము సత్యము; సగ మసత్యము.

రాధ — అదెటులు?

శార — నీమనోనాథుఁ డనుమాట సత్యము; ఇక్కడకు వచ్చుట మాత్ర మసత్యము.

రాధ — లలితా! నాకాంతుఁ డిప్పుడిచ్చటకు రాలేదా?

లలి — ఇప్పుడురాలేదా యనుమాట యేమి? ఎప్పుడు నీహృదయమునందే యున్నాఁడు కదా?

రాధ — మీరు నన్ను మోసము చేయుచున్నారు.

శార—నీమనస్సు నిన్నుఁ జేయుచున్న మోసము మాపై నారోపించు
చున్నావు.

గీ. మనసునకుఁ గలశక్తి యిం ॥ తనఁగ వశమె?
యీజగత్తంత మన సానతించినట్టి
యింద్రజాలం బటంచు మునీంద్రుఁ డొకఁడు
శిష్యునకుఁ జెప్పె నొక్కప్డు ॥ చెలువ! వింటె.

రాధ—ఛీ! జగ మింద్రజాలము గాదు. నానాథుని రాక మాయగా
దు. హా! సంగీతలోలా! గోపాలబాలా!

గీ. సరససంగీతమాధురీ ॥ సాధురీతి
నింకనొకసారి మురళి వా ॥ యింపు మయ్య!
త్వన్ముఖామృతపూరంబుఁ ॥ ద్రావుదాన
ఘనఘనాంబువు చాతక ॥ కాంతవోలె.

శార—చాతకకాంత ఘనాఘనమునొద్దకుఁ బోవనక్కఱలేదా?

రాధ—గీ. ఏను చంద్రాతపంబున ॥ మృదులవల్లి
వాగ్నిసీమను నిల్చి కృష్ణా! యటంచు
నిటులు నీరాక వేఁచితి ॥ నిష్టదేవ!
భవ్యసాక్షాత్కృతిని దపః ॥ ప్రతిభవోలె.

లలి—అమ్మా! నీతపఃప్రభావమున నదిగో! ఘనాఘనమే చాతక
కాంతయొద్దకు వచ్చుచున్నది.

[కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

(అందఱు సంభ్రమమున లేచుచున్నారు.)

శార—మిత్రమా! శేషవర్జమువలె తెల్లవాఱుగడ వచ్చితివి!

లలి—గోపాలప్రభూ! మీరింత యాలసించినందువలన మా చెలి
పరితపించుచున్నది. ఇది న్యాయమా?

రాధ—ఆప్రశ్నము నీకేల? మగవారి కేమైన పనియుండును.

శార—అమ్మా! మగవారిపని గాదు. అంతవఱకు నే నెఱుఁగుదును.

కృష్ణ—రాధా! నావలనఁ గలిగినపరితాపము నావలననే శమించుఁ గాక! (రాధను జేరఁబోయిన రాధ దూరముగఁ బోవును.)

శార—విషరోగ మిచ్చుదంతము లున్న, దాని మానుపఁగల మణి యునుగూడఁ గలకృష్ణసర్పమవని యామె యెఱుఁగును.

కృష్ణ—(అపవారించి) మిత్రమా! తారావళి యింటికిఁ బోయితి నని చెప్పలేదు గద?

శార—(బిగ్గరగ) దాసిపేరు జ్ఞప్తికివచ్చినయెడలఁ జెప్పకయుందునా?

లలి—ఏదయ్యా!

శార—తారావళి.

లలి—(అపవారించి) అమ్మా! ఆచింతచెట్టు క్రింద యింటిలో నున్న దొడ్డికాళ్ళదేనా?

రాధ—అటులనుట తప్పు; ఎవరైన నేమి? అంద దాదాక్షిణ్యస్వభావుని యనుగ్రహమునకుఁ బాత్రములే కద?

కృష్ణ—(తనలో) అహా! రాధయొక్క యౌచిత్యము?

గీ. చెక్కు చెంగావిఁ బూనదు; ముక్కరంబు
లెగరు; పూర్వుల మోవి యిట్టిట్టుగాదు;
బొమలు ముడివడ; వద్దిర! పుష్పగంధి
చిత్తశాంతత యేమని చెప్పవచ్చు.

(ప్రకాశముగా) ఓ ప్రాణప్రియా!

గీ. ఒడలుమాత్రమ చటఁ బడియుండెనేగాని
ప్రాణ మంత నీదు పజ్జ నిలిచె

శార—అమ్మా! ఆమాట నిశ్చయమే. ఇంతకుముందు చెట్లసందున నాకుఁ మధ్యమునఁ జప్పుడుచేసి మన కనేకభ్రమములఁ గల్పించి మనప్రాణములు దీయుటకు సిద్ధమైన దీతనిప్రాణమే.

కృష్ణ—గీ. తప్పుజేయు వాడు । తనువున కేదైన
శిక్ష జేసి మఱలఁ । జేర్చుకొనవె!

రాధ—మహానుభావా! నీచెక్కులపై నధరముపై నవియేమి? లలితా! అద్దము దెచ్చియిమ్ము?

శార—అమ్మా! నీనాథునిప్రాణ మిచ్చుట నుంచి యాతనిమొదలుమాత్రమే యచ్చుటకి వచ్చినందులకుఁ దారావళి యితని యంగీకారముపై జేసినశిక్షాచిహ్నములు.

రాధ—నిజముగా నవియేనా? అట్లైన నాథా! నేను వానిని జూడఁజాలను. నాహృదయము గరఁగుచున్నది. అసూయచేఁగాదుసుమీ! అయ్యో! మృదుళాంగుళులచే మెల్లగ స్పృశించుమాత్రముననే వాడునతిలలితములగు నీనుగండఫలకము లెంత బాధింపఁబడినవి! హాలోకైకసుందరా! గాలితాఁకుడుచేతనే జిల్లున నమృతము లొలుకు నీయధరబింబమునకు నేఁడీనిర్దయములగు కాట్లచే నెన్నిపాట్లువచ్చినవి! ఎంతతమకమున్నను దరళములగు నా బాహులచేఁ గరఁగిపోదు ననుభయముచే గట్టిగఁ గౌఁగిలింపవెఱతును. మోమెత్తి తేఱిపాఱఁజూచిన నీవదనమండలమున కెక్కడ దృష్టితగులునో యని నీపాదకమలాగ్రములయందే సదా నాదృష్టిధ్యానములు నిలుపుకొని యుందును. ఇఁక నిన్నిమాటలేల? నిస్థితి యవస్థలో నేఁ జూడఁజాలను. లలితా! నా కింటికి దారి చూపుము.

కృష్ణ—(తనలో)

గీ. ఫలముగోరిన యనురాగ । కలనఁ గలుగు
దానికి నసూయ యుండును । గాని నిష్ఫ
లాభిసంధిని బ్రేమించి । నట్టిరాధ
చిత్తము నసూయ యెన్నఁడుఁ । జెవకరాదు.

కోపమే లేనపుడు కోపశాంతి యెట్లు చేయఁగలను? (అపవారించి) మిత్రమా! రాధావదనచుంబనమున కైదైన సాధనము నీకుఁ దోఁచినఁ జెప్పుము.

శార—(అపవారించి) రెండువస్తువులను జెప్పెదను. వానిలో దేనినైన నెఱవుతీసికొని రాఁగలవా?

కృష్ణు—(అపవారించి) ఏవవి?

శార—(అపవారించి) లొట్టిపిట్ట మెడ కాని, ఊసరవిల్లి నాలుక కాని, సంగ్రహించినయెడల నీవిక్కడనుండియే యామెను గబళింపఁగలవు.

కృష్ణు—రాధా! నన్నుఁ గటాక్షింపుము.

రాధ—ఆవిహ్నములు పోవ్రదనుక నాకన్నులు నిన్నుఁ జూడఁజాలవు. క్షమింపుము. నమస్కారము. నేను పోయెదను. లలితా! రమ్ము.

(ఇద్దఱు పోవుదురు.)

కృష్ణు—గీ. భవ్యధూమలతికఁ గూడు । జ్వాలవలెను,
జ్వాలికను వెంబడించెడి । వాయువవలె,
వాయులహరిని వెన్నాడు । పరిమళంబు
గతిని కృష్ణుండు రాధసంగతిని నేఁగు.

(నిష్క్రమించును.)

శార—వారణముతోఁకవాలమువలె నేను నీవెంటనే వత్తును.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# రాధాకృష్ణనాటకము.

## ద్వితీయాంకము.

ప్రదేశము:—మధురాపురము.

[ప్రవేశము:—శారదుడు]

శార—నామిత్రునికి మాయవరపుబ్రాహ్మణునికివలె నెక్కుడగడవు, దిగుగడవు; కోతులలో గద్దరిగానివలె బృందావనమంతయు గగ్గోలుపెట్టి యాతఁడీమధురాపురమును జేరినాఁడు. దీపప్రభను గాంచిననల్లివలె రాధబాధ పడలేక యాతఁ డిచ్చటకుఁ గాలు కొలఁది బాఁటినాఁడు. దంతపుసలుపుగలరోగికి శీతోదకపానము ప్రాణసంకటమైనటుల విరహవేదనాపరితప్తయగు నామెకు శీతోపచారము దుస్సహముగనున్నది; ఆసుగోఁగండెవలె వీరి మధ్యమునఁ దోఁపుడులఁ బడుటచే నాత్రాడు తెగుటకు సిద్ధముగ నున్నది. ఇప్పుడు రాధాదేవి కృష్ణునొద్దకుఁ బోయి యాతని బృందావనమునకుఁ దీసికొనిరమ్మని పంప నిటకు వచ్చితిని. అంతఃపురప్రవేశమున కంగీకారమునిమిత్తము దాసిచే నామిత్రునికి వార్త నంపితిని; గాని, సెల వింకను రాలేదు.

[నేపథ్యమున]—శారదా! సాత్రాజితీదేవి సెలవైనది. మీరు లోనికి రావచ్చును.

శార—గోపాలకృష్ణుని నూతనవధువగు సత్యభామపరిచారిక నన్నుఁ

బిలుచుచున్నది. (ప్రకాశముగ) ఇదిగో ! వచ్చుచున్నాను.

(నిష్క్రమించును.)

ప్రదేశము:—సత్యభామాంతఃపురము.

[ప్రవేశము:—సత్యభామ, తరళ.]

తర—ఇఁక నట్టియాటలు సాఁగవు.

సత్య—సాఁగనిచ్చినవావిశేష మేమి? అనురాగబంధమున, బాహుబంధమున, నాజ్ఞాబంధమున, నాథుని గట్టివైచితిని. రుక్మిణికి నేర్పు తక్కువ. రూపమునమాత్రి మంతవిశేష మేమున్నది?

తర—అదిగాక స్త్రీల కంతమెత్తదనము గూడ దమ్మా ! రుక్మిణీదేవి మహారాజుగారి ప్రతిధ్వనికదా! ఊఁ యన నూఁ ఆఁ యన నాఁ.

సత్య—స్వాతంత్ర్యము సామాన్యమా? అది యుండుట కెంతసౌందర్యము కావలెను? ఎంతచాకచక్య ముండవలెను! పెనిమిటిని వశుఁ జేసికొనుట మాటలే! అందులో భూలోకసుందరుఁడైన నా నాథుని—

తర—త్రిలోకసుందరివి కావుననే నీ వీకార్యమునకుఁ గృతార్థవైతివి. పెద్దదేవిగారిపరిచారికలచేత మాకు సూటుమాటలు, వెట్టిమాటలు, తప్పినవి.

సత్య—పెద్దదేవిమాత్రము మిమ్ముల నేమిచేయఁగలదు? చూచితివి కాదా మొన్న నామెకు జరిగిన శృంగభంగము.

తర—జరిగినదేమి? మీరుజరిగించినది.

సత్య—అంతకు మనకేందులకు? నాథుఁడు మనకనుసన్న మెలఁగుచున్నాఁడని గర్వించియుండుట మంచి కాదని చూచిచూడనటులు, వినివిననటులే కాలక్షేపము జేయుచుంటిని. నీవుఁ గనిపెట్టుచునే యుంటివిగదా? అదిగాక, ఎందున నేవిశేషము లేకపోయినఁ గట్టుకొనుటలో నెక్కడియదృష్టమునకో మొట్టమొదటఁ

బడినది "జ్యేష్ఠ" యని కాంత మొగ్గరమున నేను రోజు తీసు్కొని వచ్చుచుండఁగా—

తర—అప్పుడైనను రుక్మిణిగారిదోష మని చెప్ప వీలులేదు. ఆమెల్ల కంటిదాసిమూలమున నామెకు మాట వచ్చినది.

సత్య—పరిచారికల నాజ్ఞాబద్ధలఁ జేయుటకుఁ బ్రతిభచాలనిపట్టపుదేవి యెఁకఁ బతినేమిచేసికొనఁగలదు. ఏదీ? నాలుగుమాసములనుండి బృందావనప్రయాణముఁ బెట్టుకొనినకాంతుఁ డీనాటికి వెడలఁగలిగినాఁడా? ఆపనికిమాలినరాధాసంబంధము నేనప్పుడు వీరి యింటికోడలిని గాకపోవుటచేత జరిగినది. కాని, యేనయెడల జపుగనిచ్చియుందునా? తరళా! నీవురాధ నెప్పుడైనఁజూచితివా?

తర—చూడలేదు. కాని చక్కనిదట!

సత్య—గొల్లదానికి సౌందర్యము, కోమటివానికి దాతృత్వమునా! సౌందర్యవతి యని నీతో నెవరుచెప్పిరి?

తర—మహారాజమిత్రుఁడగుశారదుఁడు.

సత్య—అతఁ డింకను రాలేదేమి? (శారదుఁడు ప్రవేశించును.) శారదా! మాటలో వచ్చితివి. నీకు నూఱేండ్లాయువు సుమా!

శార—శతము గాక మఱియొకశతమున్నను మామహారాజుగారిభార్యల సంఖ్యామధ్యమున వార్తలుమోసికొనిపోవుటకు నాకుఁజాలదు.

సత్య—నీవిప్పు డేమైన వార్తను నా కాంతునికిఁ దీసికొని వచ్చితివా?

శార—నేను బృందావనమునుండి వచ్చుచుంటినిగదా, అచ్చట భార్య లెవరున్నారు?

సత్య—(అపవారించి) తరళా! దొంగముండకొడుకు కమ్ముకొన్నాఁడు. ఇప్పుడు వీఁడేదో రాధాసందేశమును దెచ్చినట్లున్నది సుమా!

తర—(అపవారించి) నాకు నటులే తోఁచుచున్నది.

సత్య—ఇచ్చటి మేము భార్యలమైనప్పుడు బృందావనములోని కాంత లెవరు?

శార—గొల్లపడుచులు.

తర—(ఆత్మగతి) మెలుఁగకపోలేదు. మహారాజుగారికి వారికి నున్న సంబంధ మేమి ?

శార—ఏకపురనివాససంబంధము; ఏకనదీపానసంబంధము; దధిభాండ వికలనసంబాధము; నవనీతహరణ సంబంధము—

సత్య—వస్త్రాపహరణసంబంధముఁ జెప్పితివిగా వేమి? లేనిపోనిమాట లేల? శారదా ! రాధ బాగుగనున్నదా ?

శార—అనఁగా నాకుఁ దెలియలేదు. క్షేమముగ నున్నదో లేదో చెప్పవలెనా, లేక చక్కగ నున్నదో లేదో చెప్పవలెనా?

తర—ఇప్పు డాను క్షేమము దెలియక బెంగఁబెట్టుకొనుచుంటి మను కొంటివా ?

శార—సౌందర్యవతి యని పరితపించుచుంటిరా యేమి ?

సత్య—అది సౌందర్యవతి యైనఁ దద్విరహమున నాథుఁడు పరితపింప వలెను గాని, మధ్యమున మాకేమి ? ప్రసంగమున సుందరి యేనా యని యడిగితిమి. చెప్పరాదా ?

శార—చెప్ప వీఁలు లేదు.

సత్య—అనఁగ ?

శార—అసాధ్య మని.

సత్య—ఆఁ ! ఆఁ ! నిజముగానే ? అంతలావణ్యవతియా ?

శార—అమ్మా! సంగీతమునకు సౌందర్యమునకు నొకదారి గానుపింపదు. సప్తస్వరము లాయాసంపూర్ణత్వాసంపూర్ణత్వాద్యమిత భేదములచే సమసించి సంగీతమగును. అన్నిరాగములు మనోహరము లేయైన నొక్కొక్కటిమాత్ర మొక్కొక్కచెవికి నమితానందకరముగా నుండును. కారణమేమో చెవికిఁదెలియును. బుద్ధికి మొదలే తెలియదు. అటులే యాకరచరణాద్యవయవ

ములు బలదుర్బలాదిభేదములచే సాంగత్య మొంది సౌందర్య మనిపించుకొనును. అన్ని శరీరములు సౌందర్యవంతములే యయిన నొక్కొక్క దేహ మొక్కొక్కనికి సుందరముగఁ గనఁబడును. కారణము బ్రహ్మకైనఁ దెలియదు.

సత్య—కొన్ని రాగములకుఁ గొన్నిస్వరములు వర్జ్యములై యుండు నుగదా?

శార—అట్టివారే సౌందర్యప్రపంచమున నేకాక్షులు, నేకకర్ణులు, పాదశూన్యులు మొదలగువారు.

సత్య—అట్టి వక్రస్వరూపులు గూడ సౌందర్యవతు లనియేనా నీయభిప్రాయము?

శార—అమ్మా! కుబ్జాపరిత్రాతయైన శ్రీకృష్ణునికంటె మన మెక్కువ తెలిసినవారమా?

సత్య—నా నాథుని కేదో యొక్కటిగ నేయుండునేమో? కాని—

శార—అట్టిచో నీనాథుఁ డననేల? లోకనాథుఁ డనుము.

సత్య—అలాగే కాని యిది సుందరాకార, యిదియనాకార, యనుభేదము ప్రపంచమం దున్నదని నాయభిప్రాయము.

శార—నా కాసంగతి తెలియదు.

సత్య—రాధనుగుఱించి నేను కొన్ని సంగతు లడిగెదను. నీవు చెప్పవలెను.

శార—ఇప్పు డాప్రశంస యెందులకు?

తర—ఏమాత్రపువిలాసవతియో తెలిసికొనఁగోరి దేవిగారడుగుచుండినప్పుడు నీ కిట్టియసాధ్యపాండిత్యప్రకర్ష మేల?

శార—అమ్మా! సరే. అడుగుము.

సత్య—దానిదేహచ్ఛాయ యెట్టిది?

తర—అమ్మా! ముందుగా నొడలిరంగుమాట యెందులకు? కన్ను, ముక్కు తీరడుగరాదా?

సత్య—సమవిభక్తములగు నవయవముల యొక్క స్ఫురణము లేనిదైన మంచిచాయగలదా? మెడల; నజ్ఞానులగు పురుషులచే సుందరవతిగఁ బరిగణింపఁ బడును. కంటికి ఛాయాప్రధానపరిచయమే గనుక వారికన్నులు వెంటనే మోసపెట్టఁబడును. అదిగాక పురుషుల కనురాగము చర్మమాత్రగతమే, కావున చర్మమాత్రగాంభీర్యముగల యీఛాయావిలాసమునకే యబ్బా. తలాఁగి కుయాపులవలలఁ జిక్కి పరిహాసపాత్రులగుదురు. దీపకాంతిచేఁ గప్పబడిన గాజుతాయి వజ్రమువలె వెలుఁగదా? వెన్నెలలోని దృష్టిబొమ్మ నేత్రపర్వముగ నుండదా? కావున ముందు రంగుమాటయే చెప్పుము.

శార—మీకిద్దఱకు వివాదాంశము తీఱినట్లేగద?

తర—వివాద మేమియు లేదు.

శార—అటులైనఁ జెప్పెద వినుము. ఐదు భాగముల పసుపులో నొకపాలు సుద్దముగ్గు నొకపాలు కుంకుమయుఁ గలిపిన—

తర—పొడివస్తువులు గాఁబోలు! ఆవుపాలు పోసి కలుపవలెనేమో—

సత్య—తరళా! మాటలాడకుము. శారదా! మాకు నీవు చెప్పినయోగము బోధపడినదికాదు. ఆచాయగలసామ్యవస్తువును జెప్పుము.

శార—కవులు చెప్పు తలతిక్కయుపమానములు నాకు నచ్చవు.

సత్య—నీయిష్టమువచ్చినట్లు చెప్పుము.

శార—జీడిమామిడిపండువలె నుండును.

సత్య—(నవ్వుచు) ఛీ ఛీ! ఎఱ్ఱజీడిమామిడిపండు గాదు గద! తరళా! ఇక్కడికి రాధప్రసన బయటఁబడినది. చూచితివా!

తర—ఏమున్నదమ్మా! గోడచాటు గూని, గోలకొండ సాని.

సత్య—మగవా రుచితజ్ఞులైయున్న దాని ననవలసినదేమి? శారదా! రాధ పొడుగుగ నుండునా? లేక పొట్టిగ నుండునా?

శార — హాస్యరూప దీర్ఘరూప నిర్ణయమునకు నేను వైయాకరణుండను గాను. కాని, యొకసారి నీనాథుఁడు, రాధయు నొకరి యెదుట నొకరు నిలువఁబడిరి.

సత్య — (తనలో) హృదయపుటభేదన మొనర్చు వాక్యమును జెప్పినాఁడు. (కోపముతోఁ బ్రకాశముగా) అడుగనిదానికిఁ బ్రత్యుత్తర మేల చెప్పెదవు.

తర — అమ్మా! శాంతినొందుము.

శార — ఒకతె, యిద్దఱైన నసూయగాని వందలకొలఁదియైన నసూయ యేల? తనయెదుట నిలువఁబడిన యాస్త్రీ నాథుని శిరస్థమగు మయూరపింఛము రాధాసౌందర్యాతిశయమును గూర్చి శిరఃకంపము సేయుదానివలె నూఁగి యూఁగి యొకవంక కొఱఁగినపుడు శ్రీకృష్ణుఁడు తల వంచకయే రాధ తన తల యెత్తకయే యాపింఛమును రాధ గుదురుపఱచెను.

సత్య — (నవ్వుచు) తరళా! స్పష్టమాయెనదా? ఏటికొంగ, సారసపక్షి, నిప్పుకోడి, గొల్లభామ యైనందులకు గొల్లభామపురుగువలెనే పొడుగుకాళ్ళదైనదా? మొత్తుకొనినట్లే యున్నది చక్కఁదనము.

శార — పాలెపురుగుమాటఁ జెప్పమఱచితివేమి?

సత్య — ఈ గడసానికి, నీయడవికోఁతికి, నీయాకాశదీపస్తంభమునకు నానాథుఁడు వశుఁడయ్యెనా? హా! ఎంతగతిపట్టెను! నావంటి మహారాజపుత్త్రికను, నావంటి యసమానవిలాసవతి నీ బానిస సవతి యని పిలువవలసివచ్చెనా? కాలమహిమ!

శార — ఆత్మస్తుతియుఁ బరనిందయు నెఱుఁగని మీకు —

తర — ఇందున నాత్మస్తుతి యేమున్నది?

సత్య — తరళా! లోకమెఱింగిన యంశమున కాతనితో వివాద మేలకే.

శారదా! అడుగలేక నాకుఁ జెప్పలేక నీకు, బాధను విసుఁగుచునే యున్నది అయిన నొక్కయంశ మడిగెదను. రాధ ముఖ మెటులున్నది?

శార — వీఁపున కెదుటివైపున నున్నది.

తర — బ్రాహ్మణుఁడా! పరిహాస మేల? వర్తులముగ నున్నదో లేక కోలగ నున్నదో చెప్పుము.

సత్య — అంతే కాదు. ఫాలము సన్నమో విశాలమో, బొమలు నిండుగ వటువవై యున్నవో లేవో, కన్నులు సోగలో కావో, పొడచినట్లు ముక్కున్నదో లేదో, తీర్చినట్లు చుబుకమున్నదో లేదో, యీ మొదలగు సంగతులఁ జెప్పవలెను.

శార — నాపుణ్యవశమున నాకుఁ గవిత్వమబ్బినది కాదు. లేనియెడల నవయవమున కఱువది పద్యములతోఁ బ్రబంధమును జెప్పి యాక్షేపించువారే కాని యామోదించువారు లేక, తిట్లు గొట్టుకొనుచునే యుందును. అమ్మా! నన్ను బాధపెట్టక నీ వొకసారి బృందావనము వచ్చి రాధనుజూడరాదా?

సత్య — ఈరాత్రి నాకాంతునితో నేనుగూడ బృందావనప్రయాణమును బెట్టుకొనియే యున్నాను.

శార — ఆఁ! ఆఁ! నేనుజెప్పకుండనే నామిత్రము ప్రయాణోన్ముఖుఁడయ్యెనా?

సత్య — (అపవారించి) తరళా! వింటివా? ఇప్పుడు స్పష్టమైనదా? ఈ బ్రాహ్మణుఁడు నానాథుని రాధానాథునిఁ జేయుటకు వచ్చినాడు.

తర — (అపవారించి) పంపఁబనుట కేమి, పంపుట కేమి, చూచెదము గాక. ఇదివఱకు నేకావశ్యకవార్తలను బంపియుండలేదా? పదీ, పెక్కయుడుగు బృందావనమువైపునకు నీ కాంతుఁడు పెట్టు

గలిగినాఁడా? ఈపాటిమాత్రమువి శేష మేమి? కానిదానికింకను నిరాశగలిగినది కాదేమి? సిగ్గులేక యున్నివార్త లేల? ఒక వార్తపై రాకున్న నోరుమూసికొనియుండరాదా? ఇంతదైన్య మేల? ఇంతగారవ హైన్య మేల? అదిగాక నీకాంతుఁడు తనము లైయునుకొనెనా? దురాశపాతకము! నీప్రియుఁడు దనమెడ నాఁదాశఁ గట్టెనా?

శార—అమ్మా! నాహితునిఁ జూడఁదలఁచి వచ్చితిని. ఇక్కడనే యాలస్యమగుచున్నది. నేను బోయెదను.

సత్య—నీమిత్రమిప్పుడే యిచ్చటకు వచ్చును. తరువాత రాధయొద్దకు వెళ్ళిన నిప్పుడు సత్యభామయొద్దకుమాత్రము రాకమానఁడు.

తర—చెలీ! మహారాజుగారు దయచేయుచున్నారు.



[కృష్ణుఁడు ప్రవేశించును.]

సత్య—నాథా! నమస్కరించుచున్నాను.

కృష్ణ—సుమంగళీభవ!

శార—మిత్రమా! నీనమస్కారమునకెదురు చూచుచుంటిని.

కృష్ణ—ఓహో! శారదుఁడా! ఎప్పుడు వచ్చితివి? నమస్కారము.

శార—విజయీభవ! ఎప్పుడు వచ్చితినో చెప్పనా?

కృష్ణ—ఊఁ.

శార—ఎప్పుడా? నీ వెఱుఁగనపుడు.

కృష్ణ—ఎక్కడనుండి?

శార—నీ వెఱిఁగినదానినుండి.

కృష్ణ—అదేది?

సత్య—రాధ.

శార—నీవు లేక చిన్నఁబోయినదానినుండి.

కృష్ణు—అదేది?

సత్య—రాధ యని చెప్పలేదా?

శార—బృందావనము.

సత్య—నామాటలను వినుపించుకొనవేమి? నేను సత్యభామను. రాధికాదూతను జూచుటచేతనే పరవశుఁడవగునీవు రాధాదర్శనమున నెట్లుందువో?

కృష్ణు—సత్యభామా! అన్యథా యెంచకుము.

ఆ. మొదట బ్రాహ్మణుండు । పిదప మిత్రమిత్రుఁడు
సంతతానురాగ । సదన మైన
బృందనుండి వచ్చె । నే సావధానుఁడ
నగుచు మాటలాడఁ । దగదె మగువ!

శార—మిత్రమా! మొదట బ్రాహ్మణుఁడని చెప్పితివి! ఇప్పుడు మాత్రమో?

సత్య—శారదా! వేదాధ్యయనాదులు వదలి తాను పడు నభ్యసించుటవలనఁ గులభ్రష్టత్వము గలిగినదేమో యని యనుమానించుచుంటివా? నాథా! ఈతఁ డెందులకు వచ్చెనో శీఘ్రముగ నడుగవేమి?

కృష్ణు—తొందరయేల? నీవు వినుచుండఁగనే యడిగెదను.

(తనలో) గీ. శిరము చుట్టు కన్నులు సా । లెపురుగువోలె
శశమువలె వాఁడిచెవులును । సర్పనుటులు
విసపునాల్క; కోఁతివలె నా । వేగ....
గలయనూయ సంకరరూప । గాదె? ఎ ము.

(ప్రకాశముగా) మిత్రమా! నీవు నాకంటె సద్వృత్తసంపన్నుఁడవుగదా!

శార—నాకొక్క భార్య యగుటచేతనేనా?

సత్య—కాదు రాధను జూచి వచ్చుటచేత—

కృష్ణ—పూజ్యులైన నాపెంపుడుతలిదండ్రులను నీవు చూచివచ్చుట చేత—వారు క్షేమముగ నున్నారా?

శార—జ్యోతి లేనిచోట వెలుతురుండునా?

కృష్ణ—నాకై వారు దపించుచుండిరా? నన్నుఁదీసికొనిరమ్మని వారే నిన్నిటకుఁ బంపిరి కాదా?

శార—ఇది గురునాజ్ఞ. (అపవారించి) కాదు. గురుజఘనాజ్ఞ. రాధాసందేశము.

సత్య—నాథా! నీమోమిప్పుడు వినూతనవికాసముచే శోభించుచున్న దేమి?

కృష్ణ—(తనలో)

సీ. రాధ యనుసుధామధురాక్షరములు చెవిని
బడినతోడనె మనసంత ప్రభను జెందె!
నొక్కమాఱుగఁ దటుకునఁ జుక్కరాల
రప్పనను వెల్గు నమవసరాత్రివోలె.

(ప్రకాశముగ)

గీ. ప్రేమకును స్థానమగువారి క్షేమ మెఱుఁగ
సౌమనస్యంబు నాకు నైశ్వర్య మగునె?
తూర్పు తెల్లఁబాఱినశోభఁ దొలుతఁ గాంచఁ
బొద్దుతిరుగుడుపువ్వు సమ్మోదముఁ గనదె?

సత్య—నీవు ప్రేమించువా రచ్చట నున్నవా? ఇచ్చటివా రెవ్వరు? నీకు శత్రువులా! ఆహా! ఎంత వగకాఁడవు? నన్నెంత మోసము చేసితివి? నీవు నన్ను ప్రేమించితివని పొంగిపొంగి బోరగిలఁబడితినే! ఇట్టిదేనా నీయనురాగము?

తర—(అపవారించి) అమ్మా! తొందరపడకుము. మగవారిప్రేమము

నీటిపై నురుఁగువంటిది. పట్టి చూడకున్నంతవఱకే పైబఁడా
రము.

కృష్ణు—(సత్యభామచేతిని బట్టుకొని) బృందావనమున నాకనురాగా
స్పదము లున్నారని యనుటవలన నిక్కడఁగాని మఱియొక్క-
యెడఁగాని లేరని యర్థమా?

శార—(అపవారించి) మిత్రమా! క్రొత్తవార్తఁ జెప్పుచున్నావు.
మఱియొక్క-యెడ ననుచున్నావు. బొమ్మజెముడువలె జగమం
తయు వ్యాపించఁదలఁచుకొనినావా యేమి?

కృష్ణు—గీ. సర్వసమవర్తనైకప్రశస్తనరణి
రహిని గాంచిననాయను ౹ రాగమునకుఁ
బావలంబులు గానట్టి ౹ తావు లేవి?
గాలి చొరనట్టి చోటులు ౹ గలవె జగతి?

సత్య—గాలివలె సర్వచంచలుఁడవైన నిన్ను నమ్మవలసినపనిలేదు.

శార—(అపవారించి) దక్షిణనాయకత్వ మనుమిమచే లోకనాయక
త్వము నీయందే యారోపణముఁ జేసికొనుచున్నావేమి? నీ
కింత మొండితనము గలదు కావుననే యిందఱితో వేఁగుచుం
టివి. కాని లేనియెడల సర్వేశ్వరుని తరమా? (ప్రకాశముగా)
గోపాలప్రభూ! నీవు లేని బృందావనము—

కృష్ణు—నన్ను నమ్ముకొనిన గోపాలురందఱు సుఖులై యున్నారా?

సత్య—నిన్ను నమ్ముకొనినవారు గోపాలురుకారు. గోపికలు. ముందు
స్త్రీలమాట నడుగక పురుషులమాట నడిగితివేమి?

కృష్ణు—స్త్రీలమాట స్త్రీవైన నీవడుగుదు వని నేనూరకుంటిని.
మిత్రమా! గోపాలురు క్షేమముగ నున్నారా?

శార—ఆ! మీరాకకై నిలువుగుడ్లతో నున్నారు. (అపవారించి)

రభువా రిచ్చుటకు దయచేసినప్పటినుండియు నెవరిభార్యల తో వారు గాపురములఁ జేయుచు సుఖముగ నున్నారు.

కృష్ణ—(నవ్వుచున్నాఁడు)

సత్య—అదిగో! నవ్వుచున్నావు. ఎందులకు నవ్వితివో నాకుఁ జెప్పక తప్పదు. ఇప్పు డంత నవ్వవలసిన కారణ మేమి కలిగినది?

కృష్ణ—శారదుఁడు పరిహాసవాక్యప్రియుఁడుగదా! (నవ్వుచున్నాఁడు)

సత్య—హాస్యాగ్రము ముఖమున కద్దముచేసికొని యింతకుముందు నాకాంతునితో నీ వేమిపరిహాసోక్తిఁ బలికితివో యది రాధను గుఱించి యగునో కాదో చెప్పెదవా? లేదా? (శారదుని చెవిఁ బట్టుకొనును.)

శార—అయ్యో! కొలుకరాని కొయ్యనై కోఁతివంటిమగనిని గొట్ట లేక చేఁతవాతకాని చెలికాఁడనై ననాకుఁ జెవులపట్టి యొందు లకమ్మా! మిత్రమా! దూతను శిక్షించఁగూడ దని శాస్త్ర ములు ఘోషించుచున్న వని చెప్పి విడిపింపవయ్యా!

తర—(తనలో) చెవి బిగియఁబట్టుటచేత గాత్రమునకు హెచ్చుశ్రుతి పడినది.

సత్య—చెప్ప వేమి?

శార—చెప్పవయ్యా! శీఘ్రముగఁ జెప్పవయ్యా?

కృష్ణ—ప్రాణప్రియా! విడువుము.

శార—కాదు. "ప్రాణహర్త్రి" యని పిలువవయ్యా!

సత్య—(వదలుచు) ప్రాణప్రియా యని యెవరిని బిలిచితివి?

కృష్ణ—(సత్యాభామగడ్డముఁ బట్టికొని) ఇప్పుడు నే నెవతెగడ్డముఁ బట్టుకొంటినో దానినే పిలిచితిని.

సత్య—నేను నీకుఁ బ్రాణప్రియను గాను. నన్ను బ్రతిమాలవలసిన పని నీకు లేదు. నాయంతరాయ మెంతమాత్రమును లేదు.

నీవు బృందావనమున కిప్పుడే వెడలవచ్చును. అక్కడనే యుండవచ్చును. రాధతోడనే కులుకవచ్చును. తరలా! పోదము రమ్ము. (పోఁబోవును.)

కృష్ణ—ఆ. చెంపఁ గెంపు గదుర । సీత్కారమున మోవి
యదర, మోముఁ ద్రిప్పు । నంత జాఱు
కొప్పు వదలి చెదరఁ । గోపమునను బ్రీతి
నదె రమణి యొనర్చుఁ । గదర! యదిర!

శారదా! సత్యభామ కోపోపశాంతిని గోరుచున్నది.

శార—(అపవారించి) సత్యభామ గేదెదూడ జాతిలోనిది. పాలెక్క వవదలి దూడను జెఱుచుగోపాలునివలె ననురాగ మమిత ముగ గనఁబఱచి యీకాంతను బాధఁసేయుచున్నావు.

కృష్ణ—ప్రాణనాయికా! నేను—

సత్య—నీవు చెప్పఁదలఁచికొనినది నేనెఱుఁగుదును. రమ్మని రాధయాజ్ఞయైనయపుడు నన్నడుగ నేల? సంతోషముతో వెళ్ళవచ్చును. ఇఁక నీకు సత్యభామజోలి యేల?

కృ—రాధమాట కాదు. నామాట.

సత్య—నీకును రాధకును భేదములేదు. కావున నీమాటయు నాకక్కఱలేదు. నీవింత చేయుదువని యెఱుఁగక మోసపోతిని. విన నొక్కమాటఁ జెప్పుచున్నాను విను. నేను జెప్పనక్కఱలేదు. నీవు విననక్కఱలేదు. ఆలస్య మగుచున్నది. రాధ నిరీక్షించుచుండును. వేళకు రానియెడలఁ గోపపడునేమో! త్వరపడు.

కృష్ణ—రాధమాట కాదు. నామాట కాదు. నీమాటజెప్పెదను విను.

సత్య—నీకు నాయందంతయభిమాన ముండిన నీరాధ యేల దావరించును? లేదు. ఇఁకనేమియు లేదు. నే నెఱుఁగుదును. నాపై ననురాగము లేదు. నీకుబృందావనమే స్వర్గము. రాధయే రంభ.

కృష్ణు—(తనలో)

గీ. అధికరాగ మసూయచే । నకటవికట
మైనఁ బ్రకటకోపము గాఁగ । నగును గాదె!
అతిమధుర మైనదాక్షుర । సాయనంబె
మిగులఁ బులుసైనకాఁడిగా । నగును గాదె!

గీ. కొలఁదిమీఱ కోప మనునయ । ములను బోవు
పెద్దకోపము వానిచే । వృద్ధినొందు
"నుష్ణ" మన దీప మార్పను । నూర్పె యధిక
మైనవహ్ని వేలను భగ్గు । మనఁగఁ జేయు.

గీ. తరుణికోపంబునకు వడి । తగ్గువఱకు
నన్మదీయోపశాంతివా । క్యాళి వృథయె
పూర్ణవేగాధికాపగా । పూరమునకుఁ
బెట్ట సాహసించినయాన । కట్టవోలె.

(అపవారించి) మిత్రమా! నేనిప్పు డేమి చేయుదును?

శార—(అపవారించి) విరహబాధాపరితప్త యగురాధ వార్తను ముందుగ విను.

కృష్ణు—(అపవారించి)

గీ. వాదువిశ్లేష మోర్వక । నవయునట్టి
రాధనే చూడఁబోదునో । ప్రబలకోప
భార యగుభామ నూఱడిం । పంగ నిటనె
యుందునో? సఖ! యేమిసే । యుదునొ చెపుమ!

శార—(అపవారించి) ఉభయతారక మగుమార్గముఁ జెప్పనా?

కృష్ణు—(అపవారించి) ఊఁ.

శార—(అపవారించి) సత్యభామను వెంటఁబెట్టుకొని రాధయొద్దకుఁ బొమ్ము.

సత్య—(రోషముతో) నన్నింతయు పేక్ష సేయుదువా? నాకోపము నన్నుఁ దపింపఁజేయుచుండ నీకుఁ గనులఁజల్లగ నూరకుందువా? నామోమైనఁ జూడకుండ నీమిత్రునితో రాధాసంభాషణమునఁ గులుకుచుంటివా? అత్యాప్తనగు నేను రాధమాట నీ చెవినిఁ బడఁగనే యింతపగదాన నైతినా? హా! యెంతమోసగాఁడవు! 17/8/7

శార—(అపవారించి) వింటివా? కోపశాంతిఁ జేసితివి కాదని కోపపడుచున్నది.

కృష్ణు—(సత్యభామను సమీపించును.)

సత్య—రాధయింటికి దారి యటుగాని యిటు కాదు.

కృష్ణు—రాధా—

సత్య—ఆఁ! ఆఁ! నన్ను రాధాయని పిలుచుచుంటివా? నేను నీకంటికి రాధవలె నగపడుచుంటినా? ఆహా! అనురాగవశమునఁ బ్రపంచమంతయు రాధామయముగా నున్నదా? నేను రాధను గాను. మితిలేని యాసలచే వలపింపఁజేసి తుట్టతుద కీవిధముగఁ జేయఁబడిన మందభాగ్యయగు సత్యభామను. ఇదిగో! చూడుము. అగ్నిసాక్షిగ నీవు నామెడనుగట్టిన నూతనమంగళసూత్రము. ఇట్టి తేజముగల శుభచిహ్నము నాయందుండ సిగ్గులేక, గౌరవము లేక, కులీనత లేక, తమకమున నొడలిస్మృతిలేక తనంతఁదానే నీపైఁబడిన తేరగొల్లసానియైన రాధయని నన్నేల భ్రమపడితివి? ఏమీ! అంత తేరిపాఱఁజూచెద వేల! నీవుగట్టినమంగళసూత్రము నీకే యానవాలు తెలియుటలేదా?

కృష్ణు—(నవ్వుచు) నీమెడలో నిసూత్రమువంక నెవరుచూచుచున్నారు!

గీ. సూత్రమునకైన సందీక ॥ స్థూలమగుచు
క్రిక్కిఱియు నీదుచన్గవ ॥ యొక్కయంత

రమున నెట్టులో నాచూపు । లిమిడి యహహా !
కమ్మరఁగ లేవు జాతిలోఁ । గప్పలటుల.

సత్య—ఎందుల కీమాయమాటలు! నేను నిన్ను నమ్మఁజాలను.

కృష్ణు—గీ. రాగవశమునఁ దనుఁదాన । రాధ నన్నుఁ
గవిసె నంటివి సత్యంబు । కాంత! యేను
ప్రార్థనాపూర్వకముగనీ । పైని బడితి
నెవరియాధిక్య మెట్టిదో । యెఱుఁగ లేవె?

సత్య—ఇదిగో! నాయాధిక్యమేమి యొకనఁ బఱచుచునేయున్నది. నాయెదుటనే నీవు రాధాసంభాషణమునఁ నీమిత్రునితోఁ గలకలలాడుచు నీవటుండ, నదివిని సహింపలేక మూతి ముడివెట్టుకొని నేనిటుండ, రాధానురాగపరవశుఁడవై నీవటుండ, నసూయావేశముచేఁ దాపమొందుచుఁ గోపశాంతికి నీవలననొక్కమాటయైనవోచుకొనక నేనిటుండ, ఈసారథ్యమే కాదా నాయాధిక్యము.

కృష్ణు—(తనలో)
గీ. కోపము విచిత్రరూపము । కోపమునకుఁ
గనులుఁ గర్ణములును దమూ । కలన లేవు
సర్వమును గబళింపంగఁ । జాలునో కో
కఁడె యజగరమునకువలెఁ । గలదుగాదె.

సత్య—నీవనుమాటలు నేను వినకేమి? నాకర్ణములు రాధికోవార్తాశ్రవణకుతూహలపరవశములైనవా? నీవంకఁ జూడకేమి? నానేత్రములు రాధికారూపదర్శనకౌతుకవశంవదములైనవా? నేను నీతోడననుకూలముగ మాటలాడకేమి? నాజిహ్వ రాధానామసంస్మరణాతివిలోలయై యెదుటనున్న మానిసిని రాధాయని పిలిచినదా?

కృష్ణు—రాధయిఁకికి దారి యటు కాని యిటు కాదని నేను నిన్ను

సమీపించునప్పుడు నీవధిక్షేపించితివి. అంత "రాధా" యనుచు నే నేమొ చెప్పఁబోవఁగ నీవు నన్నుఁ బూర్ణముగ వినకయే నీ కోపవాక్యపారాయణారంభమును జేసితివి.

సత్య—నీ వేమనఁబోయితివో యిప్పుడు చెప్పరాదా ?

కృష్ణు—"రాధానివాసమునకు మార్గ మటు లని యెఱుఁగుదును. నా నివాసమునకు మార్గ మిటు కావున నే నే నిటువచ్చితిని" యని చెప్పఁబోయితిని.

సత్య—అదెటులు ?

కృష్ణు—ఎఱుఁగవా ?

గీ. పారిజాతకుసుమ । పరిమళసమ్మిళి
చ్ఛందనార్ద్రికతన । సుందరోరు
వర్తుల స్తనాఢ్య । భవదీయభుజబంధ
మబల ! మానివాస । మగును గాదె.

సత్య—ఏది ?

కృష్ణు—ఇదిగో ! (సమీపించును.)

సత్య—(దూరముగఁబోయి) ఏది యనియంటివనియా ? నా బాహుబంధమే నీకు నివాస మంటివికదా! ఈమాటకు నిదర్శనమేది? అన్నమాటజరుపుకొనుట యేది? ఇప్పుడే బృందావనమునకుఁ బ్రయాణముఁ బెట్టుకొనిన నీకు మనసుకుదురేది ? అని నా యభిప్రాయము కాని—

కృష్ణు—సత్యభామా! ఏమిచేయుదు? వెళ్ళక తప్పునటులు తోఁచదు.

సత్య—తప్పదా ? తప్పదా ? తరళా ! ఇక్కడ పనియేమున్నది ? పోదము రమ్ము.

తర—ఆలాగే.

కృష్ణ—కారణమును జెప్పెదను వినుము.

సత్య—కారణమేల? మాయాశీలునకుఁ గారణ మేల? బృందావన ప్రియాణమునకుఁ గారణమేల? రాధావల్లభునకుఁ గారణమేల? తరళా! ఇంక నాలస్యమేల? లోనికిఁబోవుదము రమ్ము. (అపవారించి) సఖి! అసూయచేఁ బాదాదిశిరఃపర్యంతముఁ దపించుచుంటిని. నానాథుని వదలి యుండజాలను. అతఁడుఁ బృందావనమునకీసారిపోకతప్పడు. నేనుగూడ నాతనికిఁదెలియకుండబ్రచ్ఛన్నముగఁ బోయి యాతఁడా రాధతో నెటులు కులుకునో కనిపెట్టెదను. నీవుకూడ నాతో వచ్చెదవా?

తర—(అపవారించి) తప్పక వచ్చెదను.

సత్య—(అపవారించి)ఆహా! నీమాతప్రియవిశ్వాసమైన నాకాంతునికి నాయెడల లేకపోయినది. ఆహా! మగవారిని నమ్మినయాఁడు దానిని ముక్కుసెవులు గోయవలెనుసుమా!

తర—(అపవారించి) నిజమే. కాని, మనజాతివారే మనకు ద్రోహముసేయుచుండినపుడు మగవారి ననవలసిన దేమున్నది?

సత్య—(అపవారించి) కావున శూర్పణఖకువలె [illegible]దకుఁగర్ణనాసికాచ్ఛేదము గావలసినదని నీయభిప్రాయమ[illegible]ముగా) తరళా! నీకింక నిరాశ కలుగలేదా?

తర—ఇదిగో! పోవుదము.

కృష్ణ—సత్యభామా! సత్యభామా! నాయందు దయ యుంచుము.

సత్య—నీ వది రాధను గోరఁదగినమాట. రాధాపతీ! నేనొక్కమాటను జెప్పుచున్నాను విను. నీవు రాధతో సరసల్లాపము లాడుచుండ సత్యభామపేరెత్తుదువా? నానూతనవధు వగు) సత్యభామ వలదు వలదనుచుండఁగఁ దృణీకరించి నేనిచ్చుటకు వచ్చితిని సుమా! యనియనఁబోకుసుమా? రాధచే నన్ను సూ

ను మాట లక్షింపకుమా? శారదా! భార్య నటు, భర్తనటు పంపించుటకేగదా నీవు వచ్చితివి. జాగ్రత్త. తరళా! రమ్ము.

(సత్యభామ, తరళ పోవుచున్నారు.)

శార—మి[illegible]మా! తుపాను వదలినటులు వదలినది. నీ విక్కడనే యున్నట్లు భ్రమపెట్టిసాత్రాజితీదేవినన్నుఁబిలిపించినదిసుమా! ఇఁక స్వేచ్ఛగా మాటలాడుకొనవచ్చును. మిత్రమా! నాకుఁ దెలియక యడుగుచున్నాను. దక్షిణనాయకుఁ డన నెవఁడు?

కృష్ణు—ఎందఱు భార్యలున్న నందఱియెడల భేదబుద్ధిశూన్యుఁడై యొక్కరీతిగఁ బ్రవర్తిల్లువాఁడు.

శార—ఆలాగా! దక్షిణనాయకుఁడనఁగా యముండని నాయభిప్రాయముసుమా! అతఁడుకూడ సమవర్తియేకదా; సమవర్తియనగనందఱికూడ మోసపుచ్చువాఁడనియే నాయభిప్రాయము.

కృష్ణు—అందఱియెడల సమానానురాగము గలవాఁడని.

శార—ఆలాగా! ఇట్టిదక్షిణనాయకత్వము స్త్రీలలోఁగూడ నుండిన యెడల బురుషుల కింతయమబాధ లేదు సుమా!

కృష్ణు—ఛీ! మూర్ఖుడా!

శార—అటుల [illegible]? కాంతలు తమపతులయెడల భేదబుద్ధి లేక స[illegible]గము గలిగియుండినయెడల అని నా యభిప్రాయము.

కృష్ణు—అంతేఁద.

శార—అంతేకాదు. అంతకంటెమఱియొకవిశేషమును జెప్పెదను విను.

కృష్ణు—ఏది?

శార—ఉత్తరనాయకుఁ డెవఁడో యెఱుఁగుదువా?

కృష్ణు—అప్రస్తుతప్రశంస యెందులకు?

శార—ప్రస్తుతప్రశంసయే. అందఱిభార్యల నొక్కరీతిగాఁ బ్రేమించుటయే ప్రయోజకతము గాదు. వీరందఱు నొకతెతో నొకతె

కాట్లాడకుండునట్లును, వీరందఱు గాని కొందఱు గానిప్రత్యేక ప్రత్యేకముగఁ గాని తన్నుఁ గొట్టకుండునట్లును, జూచుకొను చు నాత్మరక్షణముఁ జేసికొను నాయుమ్మంతుఁ డైనవాయకుఁ డుత్తరనాయకుఁడు. ఇతఁడు దక్షిణనాయకునికంటె గొప్ప వాఁడు. కావున, నీతని కుత్తరుఁ డని పేరు.

కృష్ణు—అబ్బా! బృందావనవార్తలఁ జెప్పవేమి? గోపిక లెటులుండి రో చెప్పుము.

శార—పతులు వారిని దమ బాహుబంధముల నుంచుకొని యెన్ని న్నిత్రిక్కులఁ బెట్టినను వారు దిక్ప్రదర్శకయంత్రములవలెపశ్చి మాభిముఖులై యున్నారు.

కృష్ణు—మూర్ఖుఁడా! దిక్ప్రదర్శకముత్తరాభిముఖమై యుండునుగాదా?

శార—అలాగా! ప్రీతియూరనైనను కొత్తగా వచ్చినకొంతసేకటి వఱకు నాకు దిగ్భ్రమము గలుగుస్వభావ మున్నది. గోపికలు మధురాభిముఖులై యున్నారని నాయభిప్రాయము.

కృష్ణు—వారిచ్చటకు వచ్చుట లేదుగద!

శార—వారిచిత్తములు మునుపే యిచ్చటకువచ్చుటచేఁ బ్రీతిమూ నమానము లగుదేహము లెటులు రాఁ గలవు?

కృష్ణు—రాధ యెటులున్నది?

శార—నీపై సంపూర్ణానురాగముగల రాధమాట చిట్టచివర నడిగితి వేమి?

కృష్ణు—అంతమం దడిగితి రనిన లోటేమి? అంతస్థితి తలచుకఁ బ్రా శస్త్యమునే సూచింపదా?

గీ. శ్రుతితరువునకు నువనిమ । ల్లతయె చివర
కుసుమ మంతంబు వల్లకి । గుమ్మడిసుమ

మునుకుఁ దత్ఫలశోభయే । మొఱ నటులనె
నామనస్సరమున కదె । నాయకంబు.

శార—ఇన్ని మాటలేల? పాగమొక్కకుఁ గోటియాకువలెనన రాదా?

కృష్ణ—స్త్రీకోటి కామె కోటీరమణి కాదా? ఆమె యెట్టులున్నదో చెప్పవేమి?

శార—ఆఱుమాసములనుండి యాహారము లేక, కదలిక లేక, నత్తగుల్లవలె నతిమందస్థితిని గలిగి యున్నది.

కృష్ణ—హా! మిత్రమా! రాధ యట్టులున్నదేమి? ఆమె నిప్పుడే చూడఁబోవుదము. కాని, మిత్రమా! రాధం జూచుటకు నాపాదము లమితమైన సంభ్రమము నొందుచున్నను నాదృష్టిమాత్రము పాపము! కోపశాంతి నొందని సత్యభామమీఁదనే యున్నది సుమా!

శార—అటులైనఁ గన్నులతో ముందువైపునకుఁ జూచుచుఁ గాళ్ళతో వెనుకకు నడచు పీకవలె బయలుదేఱుము. రమ్ము పోదము.

కృష్ణ—ఇదిగో! ఇప్పుడే బృందావనమునకుఁబోయి రాధనుజూతము.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)





శ్రీ

# రాధాకృష్ణనాటకము.

## తృతీయాంకము.

రంగము:—బృందావనము.

[లలిత, మధుర, యను చేటికలతో రాధ ప్రవేశించును]

లలి—అత్యుత్తరదేశములం దాఱుమాసములరాత్రి పిదప సూర్యోదయమగునఁట. అటులే షణ్మాసవిరాహాంతమున శ్రీకృష్ణోదయసమయము కావచ్చినది. రాధా! ఈదినము నీకు భోగిపండుగ.

మధు—ఆదేశముల నుదయించిన సూర్యుఁ డాఱుమాసములవఱకు నుండును. కావున నీదినమే కాదు. ఇక్కడనుండి యాఱుమాసములపర్యంతము ముచ్చటలపై ముచ్చటలు; వేడుకలపై వేడుకలు; పండుగలపైఁబండుగలు. కాని, లలితా! నీవును, నేనును గుడ్లగూబలవలె నీయాఱుమాసములును దొఱ్ఱలలో నుండవలసినదేకద?

రాధ—అదేమి?

లలి—అమ్మా! ఏమున్నది! లుబ్ధునితో స్నేహము సొమ్ముపెట్టెవఱకే! వైష్ణవునితో స్నేహము వంటయింటివఱకే! అటులే నీతో మా సహవాసము నీనాధుని పుష్పశయ్యవఱకే!

రాధ—అదేమిమాట ?

మధు—కాకేమి? భగవంతునికంఠమునఁ బద్మమాలిక నర్పించిన రెండుచేతులును గలసి ముకుళీభావము నొంది మాలికకును, విగ్రహమునకును, దూరముగనుండుట యాశ్చర్య మేమున్నది ?

రాధ—నే నామహానుభావుని కర్హమైన యంభోజమాలికను గాను. కాని నా కాతఁడు భగవంతుఁడే సుమా ! హా ! కృష్ణా !

ఆ. వె. త్వన్నితాంతమృదుల । దామపద్మనూనకే
సరజధూళి గాఁగ । జనన మొంది
యున్న నేను విరహ । మెన్నఁ డెఱుంగని
తన్మయత్వమునను । దగిలి యుందు.

మధు—ప్రతిబంధము లేక చలనము లేదు. చెడ్డ లేక మంచియే లేదు. కష్టము లేక సుఖము లేదు. ఈవిరహతాపమే రానున్న మహానందమునకుఁ గారణము గదా! ధరణీకాంతకు దీవ్రమైన వేసవియే చల్లని మేఘోదయమునకు హేతువు కాదా ?

రాధ—ఈవిశ్లేషాపద గడచి బ్రతికినపిమ్మట గదా ?

మధు—ఆఱుమాసములు గడపినదాన వొక్కయరగడియ గడపలేక పోదువా ?

లలి—మధురా ! నీకుఁ దెలియదు. ఫలాసన్నకాల మర్ధఘటిక యొక్కవత్సరములవలె నుండును. ఆఱులంఘనములఁ జేసినరోగికిఁ బైత్యనాడి తిరిగి పథ్యమునకు వచ్చినయెడల వంట యగుకాలమే వత్సరమువలె నగపడును. (నవ్వుచున్నది.)

రాధ—మీకు నవ్వులాటగ నున్నదా? కృష్ణా ! కృష్ణా ! కృష్ణా !

గీ. నాథకర్ణస్థశిఖిపింఛ । నవ్యరేఖ !
గన్నులాఱంగ నాబాధఁ । గాంచి తీవు

పెట్టుకొందును దల నిన్ను ! నెట్టులైన
రాధ యనుమాట నతని కర్ణమున నూఁదు.

లలి—అమ్మా ! నీవార్త నాతని చెవిని వేసి యాతనిని దీసికొనివచ్చుటకుఁ బంపఁబడిన శారదుఁడు—

రాధ—(తొందరతో) ఆతఁడువచ్చెనా? రాలేదా? ఒక్కఁడేవచ్చెనా? నానాథుఁడు రానననెనా? అయ్యో! ఈసారిగూడ నిరాశయయ్యెనా? చెప్పవేమి ? చెప్పలేవా ?

లలి—అమ్మా ! ఆఁగవా ? చెప్పనీయవా ?

రాధ—కానిమ్ము.

లలి—శారదుఁడు వచ్చినాఁడు.

రాధ—అంతే? అంతే? ఆతఁడుమాత్రమేనా? నాకాంతుఁడురాలేదా? ఆతనిని దీసికొనివచ్చుటకుఁ బంపఁబడిన యాతఁడొక్కఁడేలవచ్చెను? నానాథుఁడు వచ్చువఱకునీతని వేఁచియుండి తీసికొనిరమ్మని చెప్పితిమా? లేక, యొంటరిగారావలసినదనిచెప్పితిమా? ఐన నాతని నననేల ? మీ రాతనిఁ జూచితిరా ? మాటలాడితిరా? నానాథుఁడు రాకపోవుటకుఁ గారణమేమి చెప్పెను ?

మధు—మధురాహారము కొనరి కొనరి యిచ్చిన రుచి యధికమగునని యెంచి శారదుఁడు వచ్చినాఁడని మాత్రమే లలితచెప్పినది. నీ నాథుఁడుఁ గూడ—

రాధ—ఆహా! మధురా! 'కూడ' యనునీమాట యామధురానాథుని వేణుగానరవమువలె నవ్యయమాధుర్యమై యున్నదిసుమా!

లలి—చిరవిరహాపరితప్తవగునీ కది యవ్యయమాధుర్యమే కాదు.

రాధ—నీయాక్షేపణమున కేమి కాని, నాకాంతుఁ డిపుడిటకు వచ్చునా ? చెలులారా! మీరు సిద్ధముగ నున్నారా?

మధు—అమ్మా ! మేము సిద్ధముగ నుండుట యెందులకు ?

లలి—ఇండ్లకుఁ బోవుటకు.

రాధ—ఆరాధన యిచ్చుటకు నా కాంతునకు—

లలి—ఆరాధ నిచ్చుటకు సిద్ధముగనే యున్నాము.

రాధ—చెలులారా! ఇంకను రాలేదేమి? ఎప్పుడువచ్చును? వచ్చు నను మాట నిశ్చయమేనా? మధురా! ఆలోచించుచున్నావేమి? లలితా! సందేహించుచున్నావేమి?

మధు—అనురాగమునకు లోతెంతో యని యాలోచించుచున్నాను.

లలి—ఇది యనురాగ మగునా యని సందేహించుచున్నాను.

రాధ—సఖులారా! ప్రశస్తములగు సుగంధపుష్పములు చూడుఁడు! మధుపము లంటనివి—కేసరములు చెదరనివి—ఎండచే వాడనివి—మంచుచే బిఱుసెక్కనివి—అట్టి పుష్పములు—కొంటి రా? కావలెను. శీఘ్రముగఁ గావలెను. తీసికొనివచ్చెదరా?

మధు—నీకచభారము నలంకరించుట కేనా?

రాధ—నా కలంకారము వలదు. నా కాంతునిపాదములఁ బూజించుటకుఁ గావలెను.

లలి—అటులైన నీవు కోరినపుష్పములు రెండున్నవి.

రాధ—ఏవి?

లలి—నీ నేత్రకమలములే.

రాధ—నా కేమోగాని పాదములు వడఁకుచున్నవి. చేతులు గంపమొందుచున్నవి. ఒడలంతటి ముచ్చెమటలు పట్టుచున్నవి! హృదయకోశ మేమో కాని కంఠముతోఁ గొట్టుకొను చున్నది. చిత్త మేమో కాని స్వాధీనము లేకయున్నది. కన్నార నాకనిఁ జూతమన్న బాష్పకణము లడ్డువడుచున్నవి. రాకరాక నా కాంతుఁడు వచ్చునరికి స్వవశత లేక యాతిథ్యమున నేమియుపచార

మొనరింతునో మీరు నాయొద్ద నుండవలెను. నన్ను దిద్దుకొన వలెను. "సత్కారమునకో టున్న నంతఃకరణ పారిశుద్ధ్యమును గూర్చి యీనీయాపన్న నీపాదసేవకు రాలిని క్షమింపవలెను" అని మీరాదయామయునిఁ బ్రార్థింపవలెను సుమా! తెలిసినదా? తెలిసినదా? మీరీసంగతి మఱచిపోవద్దు. లలితా! నాకు మఱపు హెచ్చుగనున్నది నాకాంతునితో నేమనఁబోయి యేమందునో నన్నుఁ గూర్చెము సిద్ధపఱచి యుంచెదవా?

లలి—ఇక్కడ నీకు సిద్ధమునకు లో టేమున్నది?

రాధ—లలితా! నాయభిప్రాయము నీకుఁదెలిసినది కాదు. విను. శ్రద్ధతో విను. మధురా! నీవుకూడ వినవలెను సుమా! నాకాంతునితో నేననఁదగినమాటలు ముందుగ రెండుమూఁడు మాఱులు వల్లించుకొందును. అట్లు చేసినయెడల మాటలలోఁ దొట్రుపాటు లేకయుండును. మహాపూజ్యులయెడలఁ బ్రయోగింపఁదగిన లలితాలాపముల నో లలితా! నీవుమాటవడిగలదానవు. కావున నాకుఁ గొన్ని నేర్పుమనుచుంటిని.

లలి—(నవ్వుచు) ఆలాగే. అటులైన మన మొకచిన్నచిత్రము చేయవలసియున్నది.

మధు—ఏమి చేయవలసియున్నదో చెప్పుము.

లలి—రేపురాత్రి యాడఁబోవునాటకము నీరాత్రి నటకు లందఱుఁ జేరి వేషములు వేసికొనకుండ రహస్యముగ నాడి సరిచూచుకొన్నటుల మనలో మన మొకతె కృష్ణుఁ డొకతె రాధ యొకతె శారదుఁడని యనుకొని వాక్యోపవాక్యములను యుక్తియుక్తముగఁ బలికుకొనినయెడల నో రాధా! నీ వింక నొక్కపావుగడియలో నాడఁబోవు పరమార్థరాధాకృష్ణనాటకములో మిక్కిలి ప్రౌఢముగ నభినయింపఁగలవు. కృష్ణాగమనమున రాధ

పలుకవలసినమాటలను నన్నుఁ జెప్పుమంటివి గాన నేను రాధావేష మభినయింతును.

రాధ—ఆ! ఆఁ! నీవు వలదు. నేనే రాధను. పూర్వజన్మముల రాధను; వర్తమానమున రాధను; భవిష్యజ్జన్మముల రాధను; ప్రళయాంతమునఁ బునస్సృష్టిలో రాధను; నాపతి శ్రీకృష్ణుఁడు; శ్రీకృష్ణుఁడు; శ్రీకృష్ణుఁడు.

మధు—అమ్మా! లలిత చెప్పినయాలోచనము బాగుగ నున్నది.

రాధ—ఆఁ! ఆ! నారాధాత్వము దానికిమ్మంటివా? ఎంత మాటాడితివి? నేనే రాధను. మఱియొకతె రాధ యగుట నా కిష్టము లేదు. నాతోపాటనేకకాంతలకు నాకాంతుఁడు కాంతుఁడుగ నున్నను నాకుఁగంటిలోపాపయంతయైన నసూయ లేదు. సరే కదా! మీఁదుమిక్కిలి నాకు సంపూర్ణమైన యిష్టము. అందఱా మహానుభావుని పాదసేవచేఁ దరింతురుగాక! కాని, నా రాధాత్వము నేను త్యజింపఁగలనా? నేను— నేను—

మధు—అమ్మా! నేను చెప్పినది బాగుగ వినకుండ నీవు మాటాడుచుంటివి.

రాధ—చెప్పఁబోయినది వింటినిగాదా! నీవు లలితకుఁ దోడుపడి—

లలి—రాధా! చెప్పఁబోయిన దెట్లువినఁగలిగితివి? విరుద్ధముగ లేదా?

రాధ—నీ వనినమాటకంటె విరుద్ధముగ నున్నదా? నీయాలోచన నా కిష్టము లేదు. ఇష్టము లేదు. తెలిసినదా? మధురా! దాని యాలోచన నింక శ్లాఘింపవలదు.

మధు—ఆయాలోచనమును గుఱించి నేను స్తుతి చేయలేదు.

రాధ—మఱి దేనినిగూర్చి?

మధు—నీవేరాధవు. ముమ్మాటికి నీవేరాధవు. మాయిద్దఱిలో నొకతె కృష్ణుఁడనియు, నొకతె శారదుఁడనియు వేషములుధరించుకొని—

లలి—వేషధారణ మనావశ్య మని చెప్ప లేదా?

మధు—ఆలాగే కావచ్చును. అమ్మా! నేను కృష్ణుఁడను. నీ వంగీక రింపక తప్పదు.

లలి—అమ్మా! అది కృష్ణుఁడే యగునెడల నీకంగీకార మున్నను లేకున్నను నే నతనిమిత్రమగు శారదుఁడను.

రాధ—చెలులారా! ఎందుల కీబొమ్మలాట!

లలి—బొమ్మలాట కాదు. కొమ్మలాట.

మధు—అమ్మా! ఎందులకననేల? కాలము తాఁబేలువలె నతిమంద ముగ నడచుచున్నది. ఏదియో యొక వినోదమునఁ గాలక్షేప ముఁ జేసిన మంచిదికాదా? అందులో నిప్పటి కప్పటికిఁ గూడ ననుకూలించునత్కాలక్షేపము మఱింత—

లలి—మధురా! ఇప్పటి కెట్లులైన నప్పటికి రాధ కొక్క తెకుఁ దప్ప నీకును నాకునుఁ గూడ ననుకూలించునా? ఓసి వెఱ్ఱిదాన! అసందర్భము లాడుచుంటి వేమి?

రాధ—మీారిద్దఱు చెఱియొక పాత్రమును తీసికొనినయెడల—

లలి—(నవ్వుచు) అమ్మా! నీదయ యుండఁగనే మా కెంతగతి పట్టఁ దలఁచియున్నది.

మధు—లలితా! పరిహాసోక్తు లేల?

లలి—నేను శారదుఁడను గానా?

మధు—రాధాదేవి చెప్పఁబోవున దేదో విను.

లలి—శ్రీకృష్ణుఁడవు గాన నీవే విను.

రాధ—మన ప్రశస్తకాలక్షేపములో నాకుఁ జెలికత్తె లేరి?

లలి—చెలికత్తెలా? చెలికత్తెల పాత్రములా?

రాధ—ఎవరో యొకరు.

మధు—ఈలత లన్నియు నీచెలులు కారా? మేముండి నీ కంతకష్టమేఁ

కేయున దేదీ?

లలి—కృష్ణపాత్రివు కదా! నాథపాత్రిమవు కాదా! "మే ముండి నీ కంతకంటెం జేయునదేదీ?" యని యంతపేలవముగ మాటలాడుట తగునా?

రాధ—హా! దేవకీనందనా! హా! గోపికావల్లభా! హా! శిఖిపింఛశిరోభూషణా! హా! రాధాకృష్ణా!

లలి—(అపవారించి) మధురా! కృష్ణ కాలక్షేప మారంభమైనది.సిగ్గు పడకు. జాగ్రత్తఁ

రాధ—గీ. చిరవిరహదుస్సహార్తిచేఁ । బరితపించు
నన్నుఁ బాలింప రమ్ము కృష్ణా! యటంచు
మొఱల నిడితిని రావయ్య! । మొసలిబాధఁ
బడినకరిమణిఁ గాచిన । వానివలెను.

హా! వేణుగానలోలా!

సీ. మెఱుఁగుఁగుండలముల । మిసమిసల్ గండభా
గములపై నట్టిట్టు । గంతు లిడఁగ
రంగారుకటి నుండు । బంగారుపుట్టంబు
చిఱుబొజ్జనుండి కొం। చెముగ జాఱఁ
బవనపూరణమున । జవుజవ్వమని లేఁత
బుగ్గలు బూరెలై । పూరటిల్ల
నిగనిగల్ గలగజ్జ । సిగనున్న శిఖిపింఛ
మొయ్యారముగఁ దల । యూఁపుచుండ
నుత్తమోత్తమజన్మమై । యొప్పుమురళి
నధరమున మోపి జలు జల్లు । మనఁగ జగతి
గానమును జేయు కల్యాణ । కాంతు లొలుకు
నీదు వదనంబుఁ జూపి పు । నీరజాక్షి!

గీ. మును మహాలక్ష్మి రుక్మిణి । నిను గ్రహింపఁ
బంపినట్టి బ్రాహ్మణుతోడ । వచ్చి యామె
బాధఁ దొలగించినట్టులే । రాధ బాధఁ
గూడఁ దొలగింపు శారదుతోడ వచ్చి.

[కృష్ణ శారదులు ప్రవేశించుచున్నారు]

లలి—మిత్రమా! కృష్ణా! ఏమిది? రాధామధురాలాపము లాలకింప వేమి? రాధ నాదరింపవేమి? రాధానురాగరసానుభవసూచనము గనఁబఱుపవేమి? ఆహా! నీయెదుటిరాధ యనరసరసానాథుని పాలికవితాకన్యవలెనే యయ్యెనా?

శార—మిత్రమా! నేను జీవించియుండఁగనే లలితనిన్ను "మిత్రమా! కృష్ణా" యని పిలుచుచున్నదేమి? మీఁదుమిక్కిలి నిన్నసరసుఁడ వని దూఱుచున్నదేమి? బానిసకూఁతురు.

కృష్ణ—నిమ్మళముగా మాటలాడుము ఇక్కడ విచిత్రము జరుగుచున్నది. నీనందేహ మేదియో మధురావాక్యమునఁ దీఱును.

మధు—రాధా! మధురభాషిణీ! ప్రాణప్రియా!

శార—మధుర యీసారిసీకెసరుపెట్టుచున్నదేమి ? ఇది సాలెపురుగువలె స్త్రీపురుషస్వభావములుగూడ కలిగినది కాదుకదా?

కృష్ణ—వెఱ్ఱివాఁడా! తొందర యేమియులేదు. మధుర యేదోమాటలాడఁబోవనున్నది విను.

శార—మాటలాడఁబోవనున్నది కాదు. ఉన్నాఁడనుము. లింగభేదము వచ్చినది. ప్రారబ్ధము!

మధు—గీ. సకియ నినుఁజూచి యాఱుమా । సంబులయ్యెఁ
గనులు గాయలుగాఁచిన । కరణినుండె
రా వలనులేక యున్నాళ్ళు । రాకయుంటి
నాలసించిన తప్పోర్చి । యేలుకొనవె!

శార—"కనులు గాయలుగాచెను" "వేలకొనుము" అనునీమాటలు స్త్రీసామాన్యములుసుమా! స్త్రీబుద్ధియెన్నటికైనమాఱునా?

లలి—మిత్రమా! మధురానాథా! రా వలనులేకపోవుట యెట్టిదో స్పష్టీకరింపరాదా? క్రొత్తపెండ్లికూఁతు రగుసత్యభామ యెదుటఁబడి యడ్డువచ్చుటచేత నని చెప్పరాదా?

[సత్యభామ ప్రవేశించును.]

సత్య—తరళా! వేగరమ్ము. (అని ప్రవేశించును.)

శార—మిత్రమా! ఇప్పుడు లలితచెప్పిన "సత్యభామ యెదుటఁబడి యడ్డువచ్చుటచేత" ననుమాటలు సత్యభామ చెవినిబడిన మన కొంపలు మునుఁగును గదా!

కృష్ణ—మిత్రమా! మనము రాధాదిస్త్రీజనమునకుఁ గనఁబడకుండఁ మనమాటలు వారికి వినఁబడకుండ, వారి విలాసములును, మాటలును, మనముచూచి, వినఁగల పొదరింట దాఁగియుందము. (తనలో) సత్యభామ యిక్కడకు వచ్చినట్లు నే నెఱుఁగ నని సత్యభామ యభిప్రాయము.

గీ. నన్నుఁ గన్నుఁగప్పి నాతి యత్నించుట
బేలతనము గాదె చేలచెఱఁగు
గూఢముగను గప్పి కొనినంతమాత్రనఁ
దరణికిరటఁ బడక తాఱు నెటులు?

నేను తెలియనటులే నటింతును.

సత్య—తరళా! అదిగో నానాథుఁడును శారదుఁడును. వారిమాటలు మనకు వినఁబడవలెను; మనమాటలు వారికి వినబడఁగూడదు. వారు మనకుఁ గనఁబడవలెను; మనము వారికిఁ గనఁబడఁగూడదు. అట్టిప్రదేశమున మనము దాఁగియుండవలెను.

తర—ఇదిగో! ఈలవంగనికుంజములో దాఁగియుందము.

సత్యా— సరే.

తర—అమ్మా! రాధను జూచితివా?

సత్యా—లేదు. ఏదీ?

తర—ఆకడిమిగున్నక్రిందఁ జెలికత్తెలతో—

సత్యా—గొల్లత్తొత్తునకుఁ జెలికత్తెలేల? పెనిమిటిమర్యాద కనుకూలముగ నుండవలెనని కాఁబోలు! అదేమి? గాడిదవలెఁగాళ్ళకుఁ జెకుముకియా యేమి?

తర—లేదమ్మా! ఒకకాలు రెండవకాలిపై వేసినది.

సత్యా—తరళా! చూడు! మూతి కొంచెము వంకరగ లేదా?

తర—కాదమ్మా! వదన మొఱగియున్నది.

సత్యా—అంతేకద! తను వొఱగ లేదుగద?

రాధ—హాకృష్ణా! రాధారమణా!

గీ. అత్మతోడుత నాదేహ । మర్పణంబు
నీకుఁ జేసితి నాయాత్మఁ । జేకొని యొడ
లిచట విడిచితి వార్తఁ । గృశించునాదు
తనువు బరు వయ్యెనో యుగో । ద్ధరణదక్ష?

సత్యా—ఆఁ! ని న్నిక్కడ విడువక యమ్మవారిఘటమునువలె నెత్తిపై నెక్కించుకొని యూరంతయు నీనాథుని గంతులువేయుమంటివా? సిగ్గుమాలినదానా!

శార—మిత్రమా! నీ కీపని బాగుగనున్నది కాదుసుమా! అత్మను గ్రహించి దేహమువదలివేయుటలో దక్షిణను మొలను ముడిచి తాంబూలమును త్యజించెడు వైదికునివలెనే చేసితివి. నేనన్నఁ గోపము వచ్చునేమోకాని నీకు లౌకికము తక్కువ.

కృష్ణ—(నవ్వుచు) మిత్రమా! నీవు చెప్పినది నిశ్చయమే.

గీ. వైదికము గాని లౌకిక । వైభవంబు
దూర మగు సాకు; నన్ఁజూడఁ । గోరువారు
గూడ నఖిలలౌకికతంత్ర। కుటిలకలన
సర్వమును మొదలంటఁగాఁ । జంపవలయు

మధు—హా! ప్రేమరసాగాధా! రాధా!

గీ. సర్వమునఁ దన్నుమించిన । చాన లిలను
లే రనుచు విఱ్ఱవీఁగు నా । సారసాక్షి
పడుచుభామ కాళ్ళకు నడ్డ । పడఁగ నట్టు
లీ యచట నుంటి క్షమియింపు । తోయజాక్షి!

సత్య—ఓహో! ఈవ్యక్తి స్త్రీరూపకృష్ణావతారము కాఁబోలు! ఓసీ! స్వైరిణి! ఓసీ!దాసీ! నీకెంతపొగరు! నేను సౌందర్యవతి నని విఱ్ఱవీఁగితినా? నీరాధమాత్రపుసౌందర్యవతినిగానా? "పడుచుభామనా?" నాకున్నయాధిక్య మొక్క పడుచుఁదనముద క్క ప్రజ్ఞాలావణ్యాదులు లేవేమి? ఛీ! ఛీ! అసత్యవాదినీ! నేను నాథునికాళ్ళ కడ్డుపడితినా? వల దని బ్రతిమాలితినా? అధమా! అదుగో! నానాథుఁడు. ముఖమున్నది యద్దమున్నది. అదుగు! నేను దైన్యపడి ప్రార్థించితినేమో. ఉండలేక, మన సులేక, నాపైనిష్టములేక, యెట్టులో యెట్టులో నానాథుఁడు, నాయొద్దనుండెనా? రాధా! నాచెలువుని నీచెలువునిఁగ జేసి కొనుటయేకాక యూరనున్న చెలులనందఱును మగలఁగ జేసి కొనుచున్నావా! తరళా! రాధకుఁ బిచ్చియున్నదా యేమి?

తర—వట్టిపిచ్చి కాదు, మదపుఁబిచ్చి.

శార—ఇప్పుడు మధుర చెప్పినమాటలు కొంచెము బేలగ నున్నవి సుమా! "పడుచుసత్యభామ యడ్డుపెట్టుటచే రాలేకపోయితి" నని చెప్పుట నీదక్షిణనాయకత్వమునకు విరోధముగాదా? ఈ

మధురకుఁ దెలివి లేదు. ఇది కృష్ణపాత్రమే; అనఁగా మృణ్మయ పాత్రమే. అదిగో! ఆ బ్రాహ్మణపాత్రమున కషయపాత్రము నకు వలె నోరే కాని ధ్వని లేదేమి?

లలి—మిత్రమా! గడపలోఁ గాలుపెట్టకుండనే కాంతునికిఁ గావలసి నంత నిందను దీసికొనివచ్చిన మొన్న మొన్నటి చేతవాతగాని సత్యభామకే మురిసిమురిసి పోవుచుంటివా?

సత్య—ఈబానిస యెవతె?

తర—ఇది శారదపాత్రము.

సత్య—నా కొడలు మండుచున్నది. శారదుని చెవిఁబట్టికొని యూఁపి నటు లీశారదపాత్రమును గొప్వఁబట్టికొని జాడింతును.

తర—(నవ్వుచు) అమ్మా! ఇప్పుడు వలదు. శాంతింపుము,

రాధ—శారదా!

శార—ఆఁ!

కృష్ణు—మాటలాడకు. నిన్నుఁ బిలుచుట లేదు.

రాధ—శారదా! మాటలాడ వేమి.

లలి—అమ్మా!

రాధ—నీవు గుణవతివైన సత్యభామ నటులఁ దూషింపఁదగునా? మొన్నవచ్చిన నేమి? నిన్నవచ్చిన నేమి? "చేతవాతగాని సత్యభామ యా?" యేల; చేఁతవాత యైనవారొక్కరై ననున్నారా?

గీ. పాతనాథుని నామంబు । పఠన మొనరఁ
జేసి చేత నాతనిపూజఁ । జేసి ధన్య
యగునదియె చేఁతవాతను । నైనయతివ
యతివరులకైన నామహా । ప్రతిభ గలదె!

కృష్ణు—బాగు రాధా! బాగు!

గీ. బుద్ధిచేష్టలఁ బోలుపొందు । ముద్దుచెలుల
దరి మహారాగమూర్తివై । మెలఁగుచుంటి
జ్ఞానకర్మంబు లంగము । ల్గాఁగ వెలయు
ముక్తిసాధన మగుభక్తి । మూర్తివోలె.

శార—తొండ ముదిరి యూసరవెల్లి యగునటులు పత్యనురాగము
ముదిరి భక్తియగుచున్నదా?

రాధ—కృష్ణా! ప్రాణనాథా!

సీ. ముద్దుల మొగముపై । మూఁగెను ముంగురుల్
కుదురుగాఁ బైకిఁ ద్రో । యుదునొ కృష్ణ!
వక్షస్స్థలిస్థల । వకుళమాలిక చిక్కు-
నొందెను సరిగఁ జే । యుదునొ కృష్ణ!
చెక్కుటద్దములపైఁ । జెదరెను చెమ్మటల్
మృదువుగాఁ బైఁట న । ద్దుదునొ కృష్ణ!
బడలికచే నీకు । పాదముల్ నొచ్చెనొ
వదలుగాఁ జేత నొ । త్తుదునొ కృష్ణ!

గీ. అలసియుంటివి కాఁబోలు । నస్మదీయ
బాహువల్లి కాడోలికా । భాగమందు
బ్రీతినిన్నుంచి గోపికా । గీతికలను
మది యలరఁ బాడి కునుక నూ । పుదునొ కృష్ణ!

కృష్ణ—గీ. రాధ! నీ వన్నయుపచార । రాజియెల్ల
నమృతబిందుపరిపూర మై । యస్మదీయ
తాపశాంతిని జేసెను । వారసత్వ
ఘనమహాధన్యచాక్యాళి । కార్యసమము.

శార—మిత్రమా! నిశ్చయమే. రాధ మధురకు నంకల్పించిన యుప
చారములు నీకు సుఖమిచ్చినవి. నే నెఱుఁగనా? మూలవిగ్ర

హమునకు సమర్పింపఁబడిన యపూపము లర్చకునియుదర పూరణమునకే గదా?

కృష్ణ—వెఱ్ఱివాఁడా! విగ్రహమున కర్పింపఁబడినవి విరాట్స్వరూపమును జేరుచున్న వనుము.

సత్య—హా! తరళా! వింటివా? ఇనుముఁ గరఁగించి చెవులలో పోసికొనవలసినగతి పట్టినది. హా! కృష్ణా! నీకు రాధపై నంతయనురాగమా? ఏమి? రాధవాక్యములు నీకమృతోపమానములయ్యెనా? నీకుఁ దాపశాంతిఁ జేసెనా? ఇంతతాపమునకు నీకేమికారణము గలిగెను? ఈతాపమంతయు సత్యభామవలనఁ గలిగినదేనా? సత్యభామ బాహుబంధము నీకుఁ గారాబంధమయ్యెనా? సత్యభామముఖచంద్రమండలము నీ కగ్నికుండ మయ్యెనా? రాధ నీ కమృతము, నేను విషము నైతినా? హా! మోసకాఁడా! నన్నంత వేడిమాట నెప్పుడైన నాడితివా? రాధ యుదారసత్కళత్ర మయ్యెనా? నేను దాసినా? దాని వాక్యములే నీకుఁ గార్యములయ్యెనా? నాకార్యములు—నా కార్యములు—కంటకము లయ్యెనా?

తర—అమ్మా! చెలువుల ప్రేమలకుఁ జెట్టపై బదనికలకువలె మూలము లేదు.

కృష్ణ—మిత్రమా!

గీ. మదిని నన్నుంచి యారాధ । మధురఁజూడ
మధుర యంతయు నామూర్తి । మయము గాఁగ
రాధకును దోఁచె నాజగ । న్నాథభక్తి
మహితులకు సృష్టిపరతత్వ । మయము గాదె!

గీ. వర్ణతతిఁ జూచి వానియుఁ । బలికి మఱి గు
ణించిననుగాని పాండిత్య । మెటుల రాదో

మొదట నట్టులు విగ్రహ । పూజ లేక
ముక్తిసాధన మగుభక్తి । పుట్ట దెపుడు.

శార—రాధకు మధుర కృష్ణునివలెఁ గానుపించుట కొకకారణ మున్నది.

కృష్ణు—ఏది ?

శార—వెనుకనున్న తైలమును ముందున్నదీపిక పీల్చుకొనునటులు పురోభాగముననున్న మధుర పశ్చాద్భాగముననున్న నీకృష్ణత్వము నాకర్షించుకొనుచున్నది.

కృష్ణు—ప్రిజ్ఞావాక్యములఁ జాలింపుము.

లలి—మిత్రిమా! సర్వోపచారసన్నద్ధయైన రాధతో మాటలాడవేమి?

మధు—మాటలాడుటకు స్వవశత యెక్కడిది ?

కృష్ణు—సెబాస్ ! మధురా !

సత్య—సెబాసఁట! ఆహా! నా నాథునికి స్వవశతయే లేదఁట! ఎందులకో యీపారవశ్యము. అంతభళి, అంతబాపురే, అంతసెబాసనునాతఁ డింక నాపొదలోదూరి కులుకనేల? పరుగు పరుగునవచ్చి రాధకాళ్ళపైఁ బడరాదా ? ఏదీ ? ఆభళి, ఆసెబాసేదో నేనుఁగూడఁ గొంత కనపడతును.

మధు—గీ. ఒడలు వడఁకెను గడగడ । నడుగులు తడఁ
బడియె నతి పారవశ్యంబు । పరిఢవిల్లె
కరుణ భవదీయబాహువల్లరుల నన్ను
గట్టిగా సౌఖ్యమెనయుఁగఁ । బట్టుకొనవె !

(రాధను సమీపించును.)

శార—మిత్రిమా! ఇఁక నుపేక్షింపఁగూడదు. పాత్రిత్వము ముదిరి పతిత్వములోఁ బడుచున్నది.

కృష్ణు—(నవ్వుచు) తొందర లేదు. మధుర యిప్పు డన్నది మాయ

మాట. పాత్రమున కంత రసోదయ ముండునా?
శార—అలాగా! కృష్ణపాత్రమైనందులకు నీబుద్ధివిభవ మబ్బకపోయి
నను నీమాయమాత్రము లభించినది. సహవాసముచే దుర్గుణ
మతివేగ మంటుకొనును. గాని సుగుణ మటుల లభించునా?
మలినోదకమునఁ దడుపఁబడిన వస్త్రములను కల్మషాంక మం
టునుగాని శుద్ధోదకమునఁ దడుపఁబడినదానికిఁ గళంకమే
యుండదు కదా?
సత్య—నానాథుఁ డేమనియెనో వింటివా? కృష్ణపాత్రమునకంత
రసోదయముండునా? యనెను. కృష్ణున కంతరసోదయముండు
నఁట! అబ్బా! అబ్బా! నానాథుఁ డెంతరసపరవశుఁడయ్యెను!
ఎంతమహాదృష్టము లభించెను. ఒడలు గడగడ వడఁకుచున్న
దఁట! కంససంహారమునందైనఁ గంప మొందని శాంతున కిప్పుడీ
గయ్యాళిచే నెంతతటస్థించెను! అబ్బా! అడుగులు తడఁబడుచు
న్నవఁట! కాలకూటానలప్రతిమానవిషజ్వాలాభీలుండగు మగు
కాళియనాగేంద్రుని ఫణాగ్రమునఁ దాండవమాడిన నటశిఖా
మణి కీవిటకత్తెచే నెంతదుస్థితి తటస్థించెను! అబ్బా! విస్మృతి
యైనదఁట! కరాళగరాళావిరళపూతనాస్తనపానమునందైన వి
స్మృతినెఱుఁగనిజాగరిత్స్వభావున కీజారిణిచే నెంతగతి పట్టినది!
తర—అమ్మా! శాంతింపుము.
లలి—మిత్రమా! అత్తింటియల్లునికి భోజనపాత్రయొద్దవలె నీకు రాధ
యెదుట సిగ్గేల! ఆలసింపకుము.
మధు—రాధా! ప్రాణప్రియా! (మీఁద చేతిని వైచుచున్నది.)
శార—అయ్యో! మిత్రమా! చూచితివా! యీ బానిసకూఁతురుసా
హసము. ఇప్పుడైన వేగిరపడవయ్యా!
కృష్ణు—మధురా! రాధను కౌఁగిలించితివి కదా!

గీ. నీవుచేసిన యీపని । నీకు ముద మొ
సంగ దైనను నాయెడల్ । జల్లుమనియె
జ్ఞానిచేసిన కర్మంబు । వాని కేమి
కార్యమొసఁగదు లోకోప । కార మగును.

గీ. ఈవు కృష్ణుఁడ వని రాధ । యెంచుకతనఁ
గృష్ణపరిరంభసౌఖ్యంబె । యెనసె రాధ
విగ్రహామె దేవుఁ డని భక్తి । విశ్వసింప
దైవసాన్నిధ్యసౌఖ్య మందఁగ నరుదె?

గీ. వడివడిగ నీవు రాధాంస । భాగమందు
వర్తిలుచు నున్నతోన్నత । పదవిఁ గాంచి
వెలసితివి యేను బొదలలో । మిడుకుచుండఁ
దరుణిహస్తము! నాకంటె । ధన్య వీవె.

సత్య—ఆహా! దాసి—నీచసేవాపరిహీనగౌరవ యగుదాసి, నెత్తిపైఁ జల్లిగవ్వ బెట్టిన సంతవిలువ చేయనిదాసి, అట్టిదాసియొక్క హస్తమే నానాథునికంటె ధన్యమఁట! వింటివా ఆతఁ డెంత దైన్యమున కొడఁబడెనో! ఛీ! ఎంతమానహీనమైన మాటాడెనో! అనఁగూడదు కాని, ఎక్కడ పెరిగెనో యక్కడిబుద్ధు లక్కడిమాటలే వచ్చును గాని—

తర—అమ్మా! పుగవారిమాటలు, మర్యాదలు సమయోచితములే కాని స్థిరములు గావు.

మధు—గీ. ముక్కునకుఁ గెంపుగమినత్తు । భూషణంబు
చెలువఫాలంబునకు నగ । చేరుచుక్క
రమణిచెవి కలంకారము । రవలదుద్దు
మగువనునుఁజెక్కునకు సొమ్ము । మగనిముద్దు.

(రాధను ముద్దుఁగొనఁబోవును.)

రాధ—(మొగముఁ ద్రిప్పుకొని వదలించుకొని దూరముగఁబోవును.)

శార—సంతర్పణ మైనతరువాత వెళ్ళినబ్రాహ్మణున కెంతసన్మానమో నీకు నంత జరుగఁదలఁచి యున్నది.

కృష్ణు—గీ. విద్యుదుద్ధత వస్తువు । వెలయు నొకస
జాతిశక్తిద్ధ మగుదాని । సరసఁ జేర్పఁ
బడిన నది దూరమౌభంగి । వనిత మధుర
విడిచి తొలఁగె నదృష్టవంతులము మేము.

లలి—కృష్ణా! ఇటురా! ఇటురా! (కృష్ణుఁడు ముందునకు నడచుచున్నాఁడు.)

శార—మిత్రమా! నేనుఁగూడ వచ్చెదను. (కూడఁబోవుచున్నాఁడు.)

సత్య—ఆఁ! ఆఁ! నానాథుఁడు రాధయొద్దకుఁ బోవుచున్నాఁడా! ఎంతసాహసము! ఎంతసాహసము! నాథా! సత్యభామయున్నదను మాటయే మఱచిపోతివా? జాగ్రత్త! జాగ్రత్త తరళా! నాకనులలో నిప్పులు పోసికొనునటులున్నది. కడుపు మండుకొనిపోవుచున్నది. నేనుఁగూడ నాతనివెంటఁ బోదునా?

తర—అమ్మా! మఱేమియుఁ దొందరలేదు. ఎప్పుడవసరమైన నప్పుడే వెళ్ళవచ్చును.

సత్య—మహానుభావుఁడా రాధాదేవియొద్దఁ బఠింపఁబోవు స్తోత్రపాఠములు, కర్ణామృతములు, ప్రార్థనాశ్లోకములు వినుము. కాని సత్యభామమాట యెత్తిన నేను సహించను, సహించను. మొదటనే చెప్పితిని.

(కృష్ణ శారదులు రాధాదులయొద్దకుఁ బోయిరి.)

కృష్ణు—రాధా! చిత్రమైన బొమ్మలాట నాడించితివి.

సత్య—నిన్నుఁగూడ బొమ్మవలెనే యాడించుచున్నది.

శార—లలితా! మధురా! మీకుఁ బాతివ్రత్యము నశించుటచే నపాతి
వ్రత్యము వచ్చినది.

కృ—రాధా!

గీ. అమృతమును బొందునరునకు నన్నమేల?
భక్తిగలుగంగ నైహికవాంఛ యేల?
లోకనాథుఁడు గనఁబడ లోక మేల?
మధురనాథుఁడు నినుఁగోర మధుర యేల?

రాధ—స్వామీ! నమస్కారము.

కృ—సుమంగలీభవ.

రాధ—మహానుభావా! నాయుపచారము మన్నింపవలెను. నేను మీకు నిష్ఫలమైనశ్రమ మిచ్చితిని. నన్ను వలపించినవాఁడు, నాప్రాణనాథుఁడు, నాయిష్టదైవము, బృందావననాథీశుఁడు గాని మధురాధీశుఁడు గాఁడు. కావున—(చెఱఁగు మొగమున కడ్డువైచుకొనుచున్నది.)

శార—(తనలో) ప్రశస్తముగ శృంగభంగ మైనది.

సత్య—తరళా! వింటివా? రాధ నెఱజాణతనము. తననాథుఁడు మధురానాథుఁడు గాఁడఁట! బృందానాథుఁడఁట! వింటివా! ఎంత యెత్తిపొడచినదో. బృందావనములోఁ దన్ను మెడఁగట్టుకొని తిరుగక మధురకేల పోయితివి? మధురలోనింత కాలము సత్యభామతోఁ గాఁపుర మేల చేసితివి? మధురావాసము చేయుటచేతను బృందావనమునుండి, నాపరిరంభమునుండి, నీకు బహిష్కారము చేసితి నని రాధ నానాథునితోఁ జెప్పుచున్నది. ఆహా, ఎంతమాయలాఁడి కాకపోయినను నింతయనురాగగంభీరుఁడగు నానాథుని నన్నుండి వేఱుచేయఁగలదా? ప్రారబ్ధము.

కృ—(తనలో) ఆహా! రాధ భక్తిపారవశ్యము! (ప్రకాశముగా

రాధా! నీయభిప్రాయ మేమి?

శార — ఏమున్నది. "మీరువచ్చినదారినేబనరకుదయచేయవలసినదని."

రాధ — సీ. వ్రేతలు గ్రుచ్చిన । వివిధప్రసవమాలి
కాతతి సిగచుట్టుఁ । గలుగువాఁడు
నొకచేత మురళి వే । రొకచేత నవనీత
కబళ మింపులుగుల్కఁ । గలుగువాఁడు
మీగడజిడ్డుల । మెఱుఁగారుకేఁతచె
క్కుల మందహాసంబు । మొలచువాఁడు
జ్ఞానికైనను నందఁ । గారాని చిఱుపాద
ములను బంగరుగజ్జ । లలరువాఁడు

గీ. పుట్టతేనె రాధ । మోవియు నొకరీతి
నొడిసి భళి యని తల । యూఁపువాఁడు
నిట్టిలేఁతవాఁడు । బృందాధినాథుండు
ప్రభుఁడు, గురుఁడు, ప్రాణ । పతియు నాకు.

గీ. మణికిరీటాంగదాది హే । మప్రసాధ
నములు నిను రాజుగాఁ దెల్ప । నాదుమగఁడు
ధరణినాథుండు గాఁడు రా । ధామనంబుఁ
గొల్లగొన్నట్టి కడులేఁత । గొల్లవాఁడు.

శార — మిత్రమా! వింటివా? రాధయభిప్రాయము తెలిసినదా? ప్రియుఁడొకఁడు, బీఱకాయయొకటియు, ముదిరినతరువాత విత్తనమునకే కాని సరసానుభవమునకుఁ బనికివచ్చుట కల్ల. కట్టుకొన్నవారికిఁ దప్పదు గావున నిఁక మధురకు నడువుము.

రాధ — మహాప్రభూ! క్రిందటిసారి నాకు దర్శన మిచ్చునపుడు లోకసమ్మోహనబాలకాకృతితో దర్శన మొసంగితిరి. ఇప్పు డిటులేల వచ్చితిరి?

కృష్ణు—(తనలో) గీ. రాధ ముదిరినాఁడ వని ని । రాకరింపఁ
గాఁగిలించుటకంటెను । గాఢమోద
మిప్పు డొందితి రాధకు । నిష్టదైవ
మిట్టి యేఁ గాను చిననాఁటి । యేను గాని.

తర—రాధమాటలు పరిశీలనముగ వింటివా? ఇట్టిమాటలవలన నామెయభిప్రాయ మేమై యుండునో!

సత్య—ఏమున్నది; చెప్పలేదా? మణికిరీటాంగదాదిరాజభూషణములఁ బరిత్యజించి రాజ్యమునకు నీళ్ళు వదలుకొని, రాజ్యసంబంధములగు సఖభోగములనటుత్రోసిపుచ్చి, భార్యలను విడనాడి మధురను బాసిపఱచి బృందావనము వచ్చి, యొకచేత డొంకికఱ్ఱ, నొకచేతఁ బిల్లనగ్రోవిఁ బుచ్చుకొని గోవులను గోపికలను గాఁచుకొనుచు, సిగలనుబూలదండలఁ జుట్టుకొని, పెల్లుమని తనతోఁ గులికికులికి, మురిసిమురిసి, ముక్కులు గమ్మని దానియభిప్రాయముఃఇంతకంటెనేమున్నది? (మెటికవిరుచును.)

రాధ—మధురానాథా!

గీ. లోకమందలి వార్తలు । నాకు లేవు
నీ వొసఁగునైహికైశ్వర్య। నిఖలవితతి
నాకుఁ గొఱగాదు నీబాల। కాకృతిని వ
రించితిని నిష్టమైనఁ జూపించు దాని.

గీ. కానియెడ నీమహారాజ్య। గాఢపదవి
వలనఁ గలిగెడునైహిక। ములకు నిన్ను
వలచువారల దరిఁ జేరి। వారిఁ గావు
మిట్టినీరూపు నాకు రు।చింప దయ్య!

సత్య—వింటివా? తరళా! లోకమందలివార్తలు తనకు లేవఁట! లేనియెడలఁ దనకు మగఁ డేల? ఈరాయబార మేల? ఈపరితాప

మేల? ఈ యూందోళనమేల? ఈతందనాలపాటలేల? నీవు చెప్పిన ట్రేమకపురిబిచ్చి యేల? అబ్బా! ఎంతగయ్యాళి! ఎంతగరండి! ఐహికములకు నిన్ను వలచువారిదరిఁ జేరుమని చెప్పినది. ఆ శూలపుఁబోటు నాకుసువరా! రత్నాభరణములను దిగవైచుకొనుటకును, రాజ్యసంబంధమగు నఖిలైశ్వర్యముల ననుభవించుటకును, నీతనిఁ గట్టికొంటినిగాని నాకుఁ ద్రికరణశుద్ధియగు ప్రేమ యీతనియెడల లేదఁట! వాడి దబ్బరమైన ప్రేమము. తనది నిబ్బరమైన వలపు ఆహా! వదఱుపోతా! "ఇట్టి నీయూపు నాకు రుచింపదయ్యా!" యని పలికినది. ఏమి పెంకితనము! నాథుఁడు మెత్తనివాఁడగుటచేత నిన్నిబింకములు పలుకుచున్నది. కఱకుపదనువాఁడై కొప్పుఁ జేతఁబుచ్చుకొని యీాచెంపనీచెంప వాయించువాఁడైన నోరెత్తునా?

శార—అమ్మా!

సత్య—ఈ బాపనపంద కిఁద అమ్మలే కాఁబోలు. "అమ్మా" యని నన్నుఁబిలిచి యీజాణినిగూడ నటులే పిలుచుచున్నాఁడేమి?

తర—అయ్యవారి సంబాధముచేత.

శార—అమ్మా! నే నొక్కమాట చెప్పుచున్నాను విను. బృందావన గోపాలుండుగాని మధురానాథుఁడు నీపతి గాఁడని యీాతని నిరాకరించితివి. అతఁడైన నితఁడైనఁ గృష్ణుఁడేకదా? ఇతఁడు మధురకంటె నెక్కువ చెడిపోయినాఁడా? మధురను మగనిగ భావించిన నీవు కృష్ణుఁడైన యీాతని నటుల భావింపలేవా?

రాధ—అప్పుడు మధుర నే నెట్టిమూర్తిని వరించితినో యట్టి రూపముననే నాకుఁ బ్రత్యక్షమయ్యెను.

కృష్ణు—రాధా! ఇప్పుడుకూడ మధుర యట్టులే కనఁబడుచున్నదేమో చూడుము.

రాధ—(చూచి) ఏమి? మధురా! ఇంతకుముందు నీవు వహించిన బాలకృష్ణత్వ మేది?

మధు—నాధున కర్పించితిని.

శార—లలిత నాకు శారదత్వమువలె.

కృష్ణ—(తనలో) నేనిప్పుడీమెకు బాలకాకృతితో సాక్షాత్కరింతును.

గీ. చెలువ! వాల్గన్నులను గటాక్షించు మిపుడు
ఏఁడఖిలజగన్మోహనబాలలీలఁ
గలుగు రాధాధినాధుఁడో కాక ముదిరి
మోటయిన సత్యభామావధూటిపతియొ.

రాధ—(చూచి) హా! నీవు నాకాంతుఁడవే కృష్ణా!
(కాళ్ళపైఁబడును.)

సత్య—(తొందరతోఁ దరళతోఁ బ్రవేశించి) నేను ముదిసినదాననా? నేను మోటగుదాననా? నీకది నవనవలాడు పడుచుకూచి యయ్యెనా? నేను దవతెవలాడు ముసలినైతినా! పశువులతోఁ బెరిఁగిన యీపాపి, నీకు నాగరికతగలదయ్యెనా? మహారాజపుత్త్రికనై యెంతకన్నను డెబ్బఁగినదాననైన నేను నీ కడవి మృగమునై తినా? కానీ, నీకంటె కది యుక్సరసయే కానీ, నేను కురూపనే కానీ—కులకాంతనైననాపే రీయధమురాలి యొద్ద నేల తలపెట్టవలెను? వలదు వలదని చెప్పలేదా?

శార—(తనలో) స్త్రీరూపదుర్వాసమహర్షి. కొంపలు గుభిల్లునఁగూలినవి. ఇదివఱకు నాచెవి యొగిరినది. ఇప్పుడు నాథుని పిలక సిద్ధముగ నున్నది.

లలి—(అపవారించి) మధురా! క్రొత్తపెండ్లికూఁతు రెంతముగ్ధయో చూచితివా?

మధు—(అపవారించి) ఆ.

కృష్ణు—(నవ్వుచు) ఓహో! సత్యభామా! నీవెప్పుడు వచ్చితివి? ఎందులకు వచ్చితివి? నే ననినమాట లెట్లువింటివి? నీవు ముదిసితివని నే నంటినా? నీవు మోటుగా నుంటివని నేనంటినా? ఎందుల కీకోపము? నే నటు లనినటులు నీ కర్థమైనయెడల నన్ను క్షమింపుము. ఇదిగో! ప్రణమిల్లుచును.

(సత్యభామకు నమస్కరించుచున్నాఁడు.)

సత్య—(రోషముతోఁ దలఁ దన్నును.)

రాధ—(గుండెలు కొట్టుకొనుచు) హా! కృష్ణా! హా! కృష్ణా!

శార—(ఆపవారించి) మిత్రమా! "మిత్రమాపది జానీయాత్" అని నాఁడు. లే. నాయనా! లే. (అని లేవఁదీయుచున్నాఁడు.) మిత్రమా! శిష్టరక్షణాది కార్యములమాట కేమిగాని "యనేక భార్యాత్వమువలన నపాయమున్నది" యని లోకమునకు వెల్లడించుటకొఱకె త్రిన యీవతారము వని స్పష్టపడినది.

కృష్ణు—(నవ్వుచు) సత్యభామా! సంతసించితిని.

గీ. వేదశిఖపైని నుండు నా పాదపద్మ
మట్టివాదగు శిఖపైని నలరె నీదు
పాదకమలంబు నీమహా భాగ్యగరిమ
వర్ణనము సేయ భామ! యెవ్వనితరంబు?

శార—(తనలో) అట్టిభామచేతి కందియందని చేతిగల నేను మఱింత భాగ్యవంతుఁడను.

రాధ—ఎంతమహాపచారకృత్యము నీపాపపునేత్రములతోఁ జూడవలసివచ్చెను! అక్కా! అక్కా!

సత్య—ఎవతె నీకక్క, ఎవతె నీకక్క? నీకంటె నేను బెద్దదాననా? నానాథునితోఁ జేరి నీవుకూడ నేను ముసలిదనని యాక్షేపించుచుంటివా?

రాధ—లేదు. చెల్లెలా! లేదు. కాని, అయ్యయ్యో! ఎంతపనిఁజేసితివి! ఎంతపనిఁ జేసితివి! ఈమృదుశాంగుని, నీకుసుమకోమలుని, నీ నవనీతప్రియమానుని, నీ శిఖిపింఛభూషణుని, నీమురళీధరుని నీలలితముగ్ధమందస్మితవదనుని, నయ్యో! అయ్యో! కుడికవి నున్న నల్లగలువ మకరందమనుపేరఁ గన్నీరువిడుచుచున్నది. చూడు! కడుపు తఱుగుకొనిపోవుచున్నది. అయ్యో! నున్నఁగ దువ్వి ముడిచిన సిగనుండి పీడి జాజు లెటులు చెల్లాచెదరు లైనవో చూడు! అయ్యో! వానిని గన్నుల కద్దుకొనవమ్మా!

(పుష్పములఁ గన్నుల కద్దుకొని యతని శిరముపైఁ జల్లును.)

సత్య—ఛీ! స్వైరిణీ! ఛీ! సిగ్గుమాలినదానా! నాపెనిమిటితో నాయెదుటనె సరసమా! ఆతనిసిగనుండి పూలు జాఱినవా! ఇదివఱకే నేలరాలియుండు పూల నాతని సిగలోముడుచుచుంటివా! ఇఁక బూలచెండ్లనుగూడ నాడుదువా! నీవు కులకాంతకుఁబతివ్రతాధర్మములఁ జెప్పుచుంటివా! కాంతుని కనురాగపాత్రము వని గంతులు వైచుచుంటివా! శారదునిచే రాయబారము లేమి! అర్ధరాత్రమునఁ బుష్పవనముల విహారము లేమి! ఈ నాటకము లేమి! ఈ తైతక్క లేమి! సిగ్గులేదా! జాగ్రత్త! ఒడలు దెలిసికొని వర్తింపుము.

శార—(అపవారించి) మిత్రమా! ఇప్పుడు నీకు మానమే యలంకారము. క్రోధరసావేశముచే సవ్యాపసవ్యకర్షణమున కుంకించు సవతులమధ్యమున మాటలాడఁబోవు కాంతునియొక్క గతి—అడకొత్తులోని వక్కగతి—

రాధ—నాథా! నీతల నొచ్చుచున్నదా? ఒత్తుదునా! విసరుదునా చెల్లెలా! ఇదిన్యాయమా? పద్మమాలాపరాగధూసరిత మగు నాథుని కేశపింఛము పాదపరాగపాంసుల మగునటులచేయఁ

దగునా ? నే నాతనిసేవకురాలను. ఆతని దాసురాలను. అతఁడొక్కఁడే బాధపడుచుండుట నేను జూడలేదు. నేను బ్రణమిల్లుదును; నన్నుఁగూడఁ దన్నుము. (అనిప్రణమిల్లుచున్నది.)

సత్య—(తనలో) ఆహా! రాధ శాంతచిత్తత! నే నెంతదిట్టినను నంతసౌమ్యరూప యగుచున్నది. అమితసౌందర్యవతి ననుగర్వము, నేనే కాంతుని మిక్కిలిగఁ బ్రేమింతుననుగర్వము, యీమెను జూడఁగ నశించుచుండుటయే కాక యీమె నాచిత్తము నేమో యాకర్షించుకొనుచున్నట్లున్నది. ఇది యేమిమాయయో! చీ! నేను దీనికి లోఁబడుదునా! నేను వీనితో దైన్యమున మాటాడుదునా?

కృష్ణు—(తనలో)

గీ. తన్ను మించినసుందరి । ధరణి లేద
టంచుఁ దనకంటె మగనిపై । నధికరాగ
మున్నసతి లేదనుచు గర్వ । మున్న దీని
గర్వ మింతక శాంతించెఁ । గాని నోటి
బింకములు దీని నింకను । విడువకుండె.

రాధ——ప్రాణనాథా!

గీ. బడలి నాకుచమండల । భాగమందు
నీవు దల యుంచి నిదురింప । నీదుశిరము
నొచ్చు నని నాదుమెడలోని । నూత్నమల్లి
కానరం బడ్డుచేసితిఁ । గాదె కృష్ణ!

సత్య—చీ! స్వైరిణివైన నింత స్వచ్ఛముగఁ బలుకదు. ఎంతహద్దుమీఱితివి! ఎంతనిరంకుశముగ నుంటివి? చేయుకృత్యము ఘోరపాపకర మనియైన నెఱుఁగవా? చీ! మగవారల చెవిని బడు. నేమోయని నలుసంత భయము లేదా ? సిగ్గు లేదా ?

రాధ—మఱియొకమగవాఁ డెవఁడు లోకమున లేకపోవుటచేత నాకు సిగ్గులేదు. మనమగనియొద్ద మనకంత సిగ్గేల యుండవలెను!

సత్య—ఓసీ! మతిమాలినదానా! అదేమి! మఱియొకమగవాఁడే ప్రపంచమున లేఁడా?

రాధ—మన కాంతుఁడు తప్ప మఱియెవ్వరున్నారు? సృష్టిలోని జీవతతి యంతయు స్త్రీతతియే. అందఱ కొక్కఁడే పురుషుఁడు.

సత్య—సర్వసంసారచ్ఛేదకమైన యీదిక్కుమాలినవేదాంతము నా కొంపఁదీయుటకు నీ కెక్కడ యబ్బినది! హా! దైవమా! ఈ చుప్పనాతి_ఈరాకాసి-ఈపిశాచి- నాకెక్కడదాపురించెను. రాధా! ఇఁక నీవు నాపతికి రాయబార మంపినఁగాని, లేఖ వ్రాసినఁగాని, యాతనిపేరెత్తినఁగాని నిన్ను-నిన్ను-నిన్ను-నిన్న నేల; నాథా! నన్నిక్కడకుఁ దీసికొనివచ్చి నాముగమైనఁ జూడక, నాపాదమైనఁగిట్టక, నాయెదుటనే-యీసంసారఘాతినితో-నాలజ్జాపరిత్యాగినితో_హా! నాయెదుటనే-ఈపాపపుఁగన్నులు మందుచుండఁగ చేతులుకుచు-సరసమాడుచు కెవ్వుమనుచు-మీఁదుమిక్కిలి నన్నడ్డమైనమాటలు నీవనుచు-దానిచే నసిపించుచు-మహాభిమానవైన నాకిటుల గౌరవభంగము, గర్వప్రాయశ్చిత్తముఁ; జేసితివి చాలదా? ఇంక నిక్కడనెంతసే పుండవలెను? ఇపుడు నావెంట మథురాపురము వచ్చెదవా? నన్నీ యమునలోఁబడి ప్రాణత్యాగమును చేయు మంటివా? రాధా! నానాథునివంకఁ జూచెదవేమి? అతని నాఁగుమని కనుసన్నఁ జేయుచుంటివా? యమునలోఁబడి చచ్చినయెడలఁ బీడయే వదలునని మురియుచుంటివా? నేను జచ్చియైన నిన్ను సాధింతును. వింటివా? నాథా! రావేమి? రావేమి?

శార—(అపవారించి) నీకు రావణాసురునికివలె నవిచ్ఛిన్నములైన

యనేకశిరములు లేవు. ఉన్నదొక్కటల. ఉర్వినందఱు భార్యలు. బ్రదుకవలెనా! మాఱుమాటఁ జెప్పక తత్క్షణము పొమ్ము.

సత్య—నీవు రావా ? రావా ? నాకంటె నీకు రాధ యెక్కువ యయ్యెనా? నట్టడవిలోనికి నన్నిట్టు లీడ్చుకొనివచ్చి యారీతిగ నేడ్పించుట నీకు న్యాయమేనా? నే నేమితప్పుఁ జేసితివి? నిన్నింతగాఁ బ్రేమించినందుల కిటులు చేసెదవా ?

(ఏడ్చును.)

శార—(తనలో) ఇదివఱకుఁ బాడిన సంగీతమున కీమాత్రపు మంగళహారతి యావశ్యకమే.

కృష్ణ—(తనలో)

గీ. ముదిత పూర్ణానురాగసంవిదిత యగుచుఁ
బులుకు పులుకునఁ గన్నీరు । లొలుక మనసు
ఖలుకు మనియెను; ప్రియవశీ । కరణసాధ
నముల నిది స్త్రీకి సులభ ము । త్తమము గాదె?

(సత్యభామను గౌఁగిలించుకొనుచున్నాఁడు.)

సత్య—ఒడలెఱుఁగనికోపమున నేఁ జేసిన యపచారమును మీరు క్షమించవలెను.

కృష్ణ—సత్యభామా !

గీ. పరమశోభికి భయ మెట్టిదో । భాగ్య మంత
రమణికి నసూయ యెంతయో । రాగ మంత
తన్నునది నీదుకోపమం । చెన్నఁదగదు
తమప్రియకుఁ గారణంబైన । దయయె కాని.

శార—(అపవారించి) మిత్రమా ! పిడుకుట కష్టముగాని తన్నుల గొడ్డె పాలెక్కువయిచ్చును. గోపాలుఁడవు నీ వెఱుఁగవా?

సత్య—ప్రాణనాథా! క్షమింపుము. రాధా! చూచితివా! నాకాంతుఁ డిప్పు డెక్కడనున్నాఁడో! ఇంక నీతని నా ప్రక్కనుండి యెన్నఁడును వేఱుచేయకుసుమా! చేసినయెడల ననుభవింపఁ గలవు సుమా?

శార—(తనలో) కాంతుని.

రాధ—నాకుఁ గాంతుఁడు నాశిరమున నున్నాఁడు. కనులందున్నాఁడు. జిహ్వాయందున్నాఁడు. హృదయమున నున్నాఁడు. ఆతండు నాలోనున్నాఁడు. నే నాతనిలో నున్నాను.

సత్య—(తనలో) నేను దీనిమాటలచే నొకచిత్రమైన వికారమును బొందుచుంటిని. ఇది యేమో వింతగా నున్నది.

కృష్ణు—(తనలో)

గీ. గాలమునఁజిక్కు దృఢమైన ౹ వాలుగను బి
గించి యొక్కసారి లాగఁగ ౹ నెంచకుండఁ
గొంచె మిటులాగి స్వేచ్ఛగాఁ ౹ గొంత యటులు
వదలి క్రమముగా జాలరి ౹ పట్టుగాదె?

గీ. అటుల గర్వోపశాంతికై ౹ యిటులు భామ
నీడ్చి కూడ రావని బిగి ౹ యుంపకుండ
ముదిత యిష్టానుసారమే ౹ పోవవలెను
గాని రాధను విడచుట ౹ కష్టమైన.

గీ. ఇప్పు డిపు డన్నిచోటుల ౹ నేనెయున్న
యట్లుచూడనారంభించు ౹ నట్టిరాధ
భక్తికనుల కేఁ గనఁబడఁ ౹ బ్రబలఁబోదు
కనులు మూయక మనసు ప్రాఁకంగఁగలదె?

(ప్రకాశముగా) సాధు! రాధా! సాధు!

గీ. బోఁటి! బ్రహ్మాండ మంతయు నోటఁ జూపి
నట్టినన్ను శిరమునందు నక్షులందు
హృదయమునఁ బుష్పమువలె ధరించినావు
జన్మమనఁగను నీదియే జన్మ మహహా!
ఏను నీకోన నుంటినం చీవు దెలుపఁ
"బోయి వచ్చెద సెల విమ్ము పుష్పగంధి"
యనుట యెట్లులు? నీవు నాయందు నుంట
నాతి! నిన్వీడి పోవుట సాతరంబె?

రాధ—(సాష్టాంగముఁజేసి) దాసురాలియెడ దయయుంచుము.

కృ—రాధా! కళ్యాణమస్తు! లెమ్ము.

సత్య—నాథా! మధురాపురమున కిప్పుడే పోవుదము రమ్ము. శార దా! రావేమి? అదేమి? పీతవలె నడ్డముగానడచుచుంటివేమి?

శార—అమ్మా! ఈచెవికి జరిగిన పరాభవము విని యీరెండవ చెవి నీయెదుటఁ బడుటకు జంకుచున్నది.

సత్య—రమ్ము.

(కృష్ణుఁడు, శారదుఁడు, సత్యభామ, తరళ, నిష్క్రమింతురు).

లలి—రాధా! మన కిఁకఁ బని యేమున్నది? మనముగూడ మన యిండ్లకుఁ బోవుదము రండు.

(రాధ, లలిత, మధుర, నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





శ్రీ

# రాధాకృష్ణ నాటకము.



## చతుర్థాంకము.



రంగము:—బృందావనము.

[మధుర ప్రవేశించును.]

మధు—ఎచ్చటను గనఁబడదే! ఏమిసేయుదును! రాధా! రాధా! ఎక్కడతిరుగుచున్నావు? చెలులను బరిత్యజించి యొక్కతెవు పోయితివా? నీకు సుఖమక్కఱలేదా? సఖులక్కఱలేదా? కృష్ణనామకీర్తనముతప్ప నితరదృష్టియే నీకులేదా? కృష్ణవిరహమున నీకున్మాదమెత్తినదా? అఖిలలౌకికవాంఛావిరాగవై సన్న్యాసులుధరించు దట్టమైన కాషాయాంబరమును మీఁదవైచుకొని కృష్ణనామస్మరణమును జేయుచు నీవనము వెంటఁ దిరుగుచుంటివా? హా! రాధా! ఎచ్చటనుంటివి? ఓకృష్ణా! కృష్ణా!

[నేపథ్యమున] ఏఁడీ! ఏఁడీ! అక్కడ నున్నాఁడా?

మధు—అదిగో! అమితసుందరరూపయగురాధ, యతివికృతరూపవై, సంతతమందహాసపరిసాధితవదనయగునది యిప్పుడు కరుణరసవదనయై యామాలతీకుంజములప్రక్కనుండి పోవుచున్నది.

అయ్యో! అచ్చట మఱియొకదారి గాన్పించుచున్నది. ఆదా-
రిని బోవునేమో! నేను బోయి యిటుల తీసికొనివత్తును.

(నిష్క్రమించును.)

ఇది ప్రవేశకము.

---

ప్రదేశము:—యమునాసమీపమున బృందావనము.

[ప్రవేశము:—రాధ; మధుర.]

రాధ—ఏఁడీ? ఏఁడీ? నాపతి-నానాధుఁడు-నాప్రియుఁడు-నాకాంతుఁ-
డు- నామనోహరుఁడు-నాప్రాణనాధుఁడు-నాప్రభువు-నాగు
రుఁడు-నాపరిపాలకుఁడు - నాభగవంతుఁడు-నాసర్వము-ఏఁడీ?
ఏఁడీ? (ఏడ్చుచున్నది.)

మధు—అమ్మా! ఇచ్చట లేఁడు. మధురలో నున్నాఁడు.

రాధ—నీలోనున్నాఁడా? నీలో నున్నాఁడా? ఇదిగో! నమస్కారము.
నానాధుని నాకిమ్ము. ఈయకపోయినయెడలఁ జూపింపుము.
చెలీ! నావల్లభుని నీహృదయమునఁ దాఁచుకొంటివా? ఏఁడీ?
కనఁబఱుపవా? పుణ్యముఁ గట్టుకొనవా ?

మధు—అమ్మా! మధురాపురములో నున్నాఁడు.

రాధ—గీ. అదిగో ! యాకాశమని జను । లనుచునుందు్రి
గాని యది తమచుట్టును । లోన నంత
టను గల దటు మధురయం।దున వసించు
నతఁ డనుచు కాని సర్వత్రి । వ్యాప్తుఁడగును.

నేను జెప్పఁబోవున దేమనఁగా—ఒక పావుగడియకి్రిందట నాతో
మాటాడిన నాప్రాణకాంతుఁ డిప్పు డెక్కడకుఁ బోయెను?

సీ. తనపట్టు బట్టకొం।గునకు నాజేగఱు
పుట్టంబునకు ముడిఁ । బెట్టినాఁడు

సొగసైన తనసోగ । సిగనున్న మందార
పుష్పముల్ నాజడ । ముడిచినాఁడు,
జగదవనార్థ్యపత్రిశస్తమౌ తనచేయి
విడ నని నాచేతఁ । బెట్టినాఁడు,
చెవిలోన నొకమాటఁ । జెప్పెద నని తన
మోము నామోముపైఁ । బూన్చినాఁడు.

గీ. ఇట్టిప్రాణనాథుఁ । డేఁడి! యేఁడీ! యేడ
కేగెనో తెలుపవె! । యీవు చూడ
లేదె? యివ్వి డిప్పు । డేఁగెన! వెదుకవే!
లేవె! లేవె! వానిఁ । దేవె! పోవె!

మధు—అమ్మా! ఆతఁ డిచటకు రాలేదు. మనస్సు కుదుటపఱుచుకొనుము.

రాధ—అసత్యమాడుచున్నావు.

గీ. పులక లింకను మేనిపై । నిలిచి యుండె
గుండె లివిగో! యింకను గొట్టుకొనుచు నుండెఁ
గన్నుఁగవ నింక బాష్పముల్ । గ్రుమ్మచుండెఁ
బరవశత్వంబు నన్నింక । వదలకుండె.

గీ. తళుకుమంచు మించు । దుళకరించినరీతి
నిట్టె వచ్చి యట్టె । యేఁగినాఁడు
కనులఁ దమము గ్రమ్మెఁ । గర్ణముల్ గడియలు
వడియె జడత బొడమె । నొడలు వడఁకె.

హా! రాధాకృష్ణా! ఎక్కడనుంటివోయి ప్రాణనాథా!

గీ. యతులు నిన్ గాఁగిలింపఁగ । మతుల నెంచి
సతు లగుచు నిత్యసౌఖ్యసం । తతులఁ గాంచి.

యుండ, నట్టిశాశ్వతమోద । ముంద లేక
సతిని యతి నైతి కర్మసం।గతిని బట్టి.

మధు — రాధా! నీపాదములకు మ్రొక్కెదను. ఇంటికిఁబోవుదము రమ్ము.

రాధ — ఆహా! అవిగో! అవిగో! నానాథుని పాదపద్మచిహ్నములు నేలను దట్టముగఁ బడిన ప్రసవపరాగముపైనున్నవి. మధురా! చూడు!

గీ. సవ్యపాదాంక మిది రజ।స్థలమునందు
నంతయును మోసె కుడి దని । యంగుళులును
మడమమాత్రమె మోసె తి।స్మర్థ్య మిలను
గానఁబడ దట శంఖచ।క్రంబు లుంట.

నమస్కరింపుదును. కన్నుల కద్దుకొనుదును. (కన్నులకద్దుకొనును)
అయ్యయ్యో! మిక్కిలి సమీపమునకు రాకు! కొంగు దగిలి చెడిపోవును. అదిగాక పవిత్రమైనవస్తువునకు దూరముగ నుండవలెను గదా?

గీ. కాంతుపాదంబు లేను నా।కన్నులందు
శిరముమీఁదను నెదయందుఁ । జేర్చుకొంటి
నెన్నిమారులో కాని యీ । చిన్నె లచట
నిలువఁబడవయ్యెఁ బ్రారబ్ధ । కలన వలన.

ఓపుష్పరాగమా! నీది యుత్తమజన్మము.

గీ. సృష్టిలోపల పుష్పమే । మృదులరూప
మందులోపల తద్రజ । మౌట నీవు
మృదులతమమవు నీవలె । మృదులమైన
ప్రకృతికిని గాక యీమహా । భాగ్య మున్నె?

మధు — (తనలో) అయ్యయ్యో! ఇక్కడ పాదచిహ్నములే లేవు. నా చెలి భక్తిపారవశ్యమున హృదయస్థము లగుశ్రీపాదములనే

యిచటఁ జూచుచున్నది. ఇంటికి రమ్మనిన రాక యున్నది తదేక నిష్ఠచే నితరవ్యాపారశూన్య యగునీమె యేమిచేయనున్నదో? కనిపెట్టుకొనియుండవలెను. రాధా !

రాధ—అంగుళు లంటుటచే నాకాంతుఁ డటుల పోయియుండవలెను. ఈజాడలను వెంబడింతును. (కొంత నడచుట నభినయించును.) అదిగో! నానాథునికిఁ బ్రియకరమైన నీపవృక్షము.

గీ. అచట దాఁగుడుమూఁతల । నాడ నేను
దొంగ నైతి నటంచు నా । కొంగుఁబట్టి
పుష్పమాలల నరవండ । ములను వైచి
పలికితివి యటుల "శరీమ । లలిత వీవు.

గీ. ప్రథమ మాఁదిది తప్పు దీ । క్షు మగుశిక్ష
యనవసరము కారాబంధ । మునకు బదులు
నీకుఁ గరబంధశిక్ష యే । నిచ్చియిచ్చి
నాఁడ నుభయతారక మగు । లీల బాల"

ఓనీపవృక్షమా !

గీ. రాధికాచిత్తహారణవి । భ్రాజి వైన
మాయ కాని నీకొమ్మల । మాటునందు
దాఁచితివా? యేను గొమ్మను । దాఁచుకొందుఁ
బైఁటమాటున నోసగుమా । ప్రాణపతిని.

(గరుడపక్షి 'కృష్ణా' యనుచున్నది.)

ఆహా ! ఆహా ! కృష్ణా యనునార్తస్వరము వినఁబడినది ! ఎవతెయో నావంటియభాగ్యురాలు, నావంటి కృష్ణపాదసేవకురాలు, నాథునిఁ గానలేనినావంటి మందభాగ్యురాలు, నానాథు నతికరుణముగఁ గృష్ణా, యని పిలుచుచున్నది. అక్కా ! నీతోఁపా టేడ్చుచు నే నిక్కడ నున్నాను. (ఏడ్చుచున్నది.)

మధు—అమ్మా! ఊరకుడుము. కడిమిచెట్టుపై గరుడపక్షి యఱచినది. మఱేమియు లేదు.

రాధ—గరుడపక్షియేనా? సరే మఱింత మంచిది. కృష్ణా యని పిలిచెను కాదా? కృతార్థములైన దాని నేత్రములకు నానాథుఁడు గనఁబడుచున్నాఁడు కావుననే యది పిలిచినది. నేనుఁ గూడ వృక్షాగ్రమున కెక్కినయెడల నాకేల గానఁబడఁడు? (చెట్టు నెక్కుట నభినయించును.)

మధు—(బలవంతముగఁ బట్టుకొని మాన్పును)

రాధ—(ఏడ్చుచు) నానాథునిఁ జూడనియ్యవా? నాకనులకు సాఫల్యమును గలుగనియ్యవా? నన్నీయమునలోఁ బడి ప్రాణత్యాగమును జేయుమంటివా?

మధు—అమ్మా! శాంతింపుము. నీనాథుఁ డాచెట్టుపై లేఁడు

రాధ—అక్కడ లేకపోయిన నెక్కడ నున్నాఁడో చెప్పుము. నన్నచ్చటకుఁ దీసికొనిపొమ్ము. లేనియెడల నన్నుఁ బోనిమ్ము. విడువు-విడువు. అడుగో! అడుగో!

మధు—ఎక్కడ?

రాధ—అడుగో! అడుగో! కనఁబడుచుండెఁగనే.

మధు—అక్కడ నేమియు లేదు. కనులు మూసికో. (కనులుమూయుచున్నది.)

రాధ—హా! హా! హా! (నవ్వుచున్నది.) బాలకృష్ణుని దుండగము సహింపక, గోపిక లొకమా ఱతని గదిలో నొక్కనినుంచి పైని దాళము వేయుటకుఁ బ్రయత్నించిరి; బీగ మింక వేయుచుండఁగనే బాలగోపాలుఁడు గదివెలుపలకు వచ్చి గోపికలతో నిటులనెను. హా-హా-హా-(నవ్వుచున్నది)

గీ. "గృహపరిచ్ఛదరంధ్రప్రకీర్ణసూక్ష్మ
తరణిబింబంబు ముగ్ధబాలురు కరమున
మూయ నేమానొ మీగృహంబులను నిల్చి
నన్ను గది మూయ నది యేను కన్నెలార!"

ఓసీ! నాకన్ను మూసితివి గాని నాకాంతుని మూయఁగలవా? నా కాంతుని బ్రహ్మాండమైన మూయఁగలదా? చేతులు వద లుము.

మధు—అమ్మా! కొంచెము శాంతించినపిమ్మట వదలుదును.

రాధ—హా! హా! హా! (నవ్వుచున్నది) ఇప్పుడు నాకు దేహము తెలియుఁ గన్నులే!

గీ. నాథదర్శనపరిపూర్ణనవ్యరాగ
రసతరణితాన్మదతూలరమణి! నీవు
చేయి వైవఁగ నవి చెల్లిచెదరి మెల్ల
మొదల రసబిందుసంతతివలెను విరిసె.

కంటె కొక్క-కృష్ణుఁడు! కంటె కొక్క-కృష్ణుఁడు! ఇడుగో! వేణుగోపాల కృష్ణుఁడు! అడుగో! గోపికావస్త్రాపహారి. ఇడుగో! నవనీత చోరుఁడు. అడుగో! ఉలూకలబద్ధుఁడు! ఇడుగో! యశోదా స్త నంధయుఁడు. అడుగో! రాధికావేణ్యాకర్షకుఁడు.

మధు—అమ్మా! నీకు మతిచెదరుట కాని కన్నులు చెదరుట కాదు. కన్నులు మూయుటచేత మఱింత యున్మాదకరముగ నున్నది (అని విడుచును.)

రాధ—అప్పు డఖిలబాలలీలలు గనఁబఱచిన ముద్దుకృష్ణుఁడేడీ? వేఁడీ అయ్యయ్యో! ఎంతలో మాయమయ్యెను! మధురా! నాక న్నుల నింకొకసారి మూయవా? నీ పాదములపైఁ బడెదను. మూయవా? (పడును.)

మధు—అమ్మా! ఎంత ప్రారబ్ధము తటస్థించెను! లెమ్మా. ఊరడిల్లుము.

రాధ—(కన్నులు దనచేతితో మూసికొని) అయ్యో! అయ్యో! ఏమియుం గనంబడుట లేదు. ఒక్కసారి నీచేతితో మూసిన నింత మహానందము గలిగినదే చూతు! ఆచెలువుడు పాలు నీచేతితో నాకంటిలోం బోసినమొదల సర్వకాలసర్వావస్థలయందును ప్రాణనాథనిరంతరాయదర్శననిత్యమహానందపరవశనై యుందును. మధురా! ఆపుణ్యమును గట్టుకొనవా?

మధు—అమ్మా! నేనొక్కమాటం జెప్పెదను వినుము

రాధ—నానాథుని మాటయేనా? ఆతనిమాటయైన విందును. ఆతని యాటయైనం గందును. ఆతనిపాటయైన విందును.

మధు—సంగీతమువలనం జిత్తము సాధువగును. కావున నామహానుభావునిపై నీవు రచించిన గీతమును బాడరాదా?

రాధ—అంతకంటె సంతోషమేమున్నది; పాడవచ్చును. పాట కనుగుణముగ నాడవచ్చును. సర్వాభరణములతో గజ్జెలం దీసివైచితిని. నీగజ్జెలు నాపాదములకుం గట్టుము.

మధు—అలాగే (కట్టుచున్నది.)

రాధ—భక్తికిని గజ్జెలకును బరమమైత్రిసుమా! భక్తిరసావేశమైన ప్రాణనాథుని వేణువునకు బంగరుమువ్వ లందుకొఱకేసుమా!

(పాడుచు నృత్యము సేయుచున్నది)

కృష్ణ! కృష్ణ! శ్రీకృష్ణా! కృష్ణా! కృష్ణా! కృష్ణా! కృష్ణా! కృష్ణా!

తొగరుమోవిచే-సొగసగునీనగు- మొగముగవరచర కృష్ణా!॥ కృష్ణ॥

ముద్దులు గులుకకం - మోమున మురళిని - మునుకొని యూవర కృష్ణా!॥ కృష్ణ॥

బహుభవపాపవి- భంజనమగు శ్రీ- పదములజూపర కృష్ణా!॥ కృష్ణ॥

ప్రాణనాథ! నీపదములం బట్టిన, రాధను బ్రోవర కృష్ణా! ॥ కృష్ణ॥

రాధను బ్రోవర కృష్ణా! రాధను బ్రోవర కృష్ణా!
హా! రాధాకృష్ణా! మూర్ఛిల్లుచున్నది.)

మధు—(ఏడ్చుచు) చెలీ! ఎంతగతిపట్టినది! ప్రకృతిసుకుమారయై, మహాసుందరియగు నీవనితాశిఖామణికిఁ గృష్ణానురాగమున నెట్టి యిక్కట్టు తటస్థించినది! కేశములకుఁ దైలసంస్కారము లేక యొడలికిఁ జందనాదిచర్చలు లేక, కంఠమునకుఁ బుష్పదామాద్యలంకారములు లేక, తనువునకుఁ బరిశుభ్రమైనవసనమైన లేక, రాత్రింబగళ్ళు నిద్రాహారములు లేక, సర్వసంగపరిత్యాగమును జేసి, యతులలుంగిమీఁద వైచుకొని, యడవులపాలై సంతతశ్రీకృష్ణనామసంకీర్తనమున నోరు కాయలుగాయ, భక్తిపారవశ్యప్రేరితతాండవమునఁగాళ్లు బొబ్బలెక్క, సతతోపవాసములచే నవసి నవసి, శల్యావశిష్టమై, దేహస్మృతి లేక, చాఁపచుట్టుగఁ గ్రిందఁబడి మట్టిలో—అయ్యయ్యో! అయ్యయ్యో!—నిశ్చేష్టతను వహించియున్నది. ఏమిసేయుదును; రాధా! రాధా! అయ్యో! పలుకకున్నది. ఏమిగతి! హా దైవమా! రాధా! రాధా! అయ్యో! ఇంకను స్మృతిగాకయున్నదా! హా! కృష్ణా! కృష్ణా! దయాళూ! హా! రాధాకృష్ణా!

రాధ—(లేచి) ఏఁడీనానాథుఁ డేఁడీ! ఏఁడీ! పరమదయాపరుఁడై తనపాదములు రెండును నాశిరముపైఁ బెట్టిన యామహనీయుఁ డేడీ! "రాధా! బడలితివా! భక్తివశమున సోలితివా! ఇఁకఁ గొంచెముమాత్రము శ్రమము పడినయెడల నీవు నాసాన్నిధ్యమున నిత్యానంద మొందుదువు. నీజన్మమిఁక సఫలమైనది. నీవింకఁ దరింపనున్నావు" అని చెవిలో మహామధురగంభీరభాషణంబుల నాడిన యా జగదేకవంద్యుఁడు భక్తవత్సలుఁడు, పరమపావనుఁ డేఁడీ! ఏఁడీ! ఏఁడీ! (ఏడ్చుచున్నది.) ఏమీ!

ఏమీ! హా! అదేమి! ఘప్పునని యొకసారి యనేకచంద్ర మండలప్రకాశమువలెఁ గనఁబడు నావెలుఁ గేమి! దుర్నిరీక్ష్యమైన తేజమయినను, నాకంటికిఁ బ్రసన్నముగ నున్నది. క్షీరాబ్ధినుదయించు నమృతకలశమువలె—అదుగో! అదుగో!—నానాథుఁ డాదివ్యతేజమునుండి బయలువెడలినాఁడు. హా! హా! (అని నవ్వుచున్నది.) అదుగో! అదుగో! నాప్రభుఁడు.

సీ. కదువడి నడచుచోఁ । గాళ్ళ కడ్డంబైన
కుచ్చి ళ్ళెడమచేతఁ । గూర్చి పట్టి
వలెవాటుపైఁట శాఖలఁ దాకు నని సువ
ర్ణోత్తరీయము కటి । నొత్తి చుట్టి
సర్వలోకాభయ । చరణమైనకర "మాకు
మే వత్తు" నభినట్టు । లిటులు చాఁపి
చెవి నున్న చెంగల్వఁ । జేరి ఝు మ్మనుభృంగ
మును శిరఃపరికంపమున నదల్చి

గీ. ఘల్లు మనఁగను మొలనూలు । ఘంటికలును
గాళ్ళ గజ్జెలు మొఱయ భ । క్తప్రలాప
సంశ్రవణసంభ్రమచ్ఛన్న । సస్మితుఁడయి
దివ్యమంగళమూర్తి యే । తెంచు నదిగో!

మహాప్రభూ! లోకనాథా! భక్తురాలి సాష్టాంగదండప్రణామము నంగీకరింపుము. (సాష్టాంగము నభినయించును.)

(శేవి) గీ. ఉపనిషద్దివ్యవల్లరీ । ప్రోజ్జ్వలత్ప్ర
సూనములు నీకుపాదముల్ । సులలితములు
కటికనేల మోపఁగ నొచ్చుఁ । గాదె! నాదు
చేతులను బెట్టరాదె! యీ । చేతులైన.

గీ. భవ్య భవదీయ నామసం।భావనప్ర
బంధ బంధురగాన సం।బంధితాళి
కర్ణరంబునఁ గాయలు । గాచె గుర్విచ్చు
కొను నని సుమరజముఁ బూసి । కొంటి నిదిగో !

ఈచేతులపై మెల్లగ నీపాదముల నుంచుము. (చేతుల నొకటితరువాత నొకటి యుంచుట నభినయించును.)

ఈకాలు దీనిపై—ఈకాలు దీనిపై—ఇటు—ఇటు.

మధు — అమ్మా ! ఇంత వెఱ్ఱి యేమి ?

రాధ— ఇదిగో ! ఈపీఠమున దయచేయుఁడు.

ఆనందభైరవి—ఆదితాళము.

ఎన్నాళ్ళకో నాకన్నులఁబడితివి, ఇఁక నిను విడువనుగోపాలా!
ఎన్నాళ్ళ!
చల్లగ గంధముఁ బూయుదునా! చామరమును గొనివిసరుదునా ! ఎన్నాళ్ళ!
మల్లెలఁ బూజలఁ జేయుదునా! నామానసమును నీకిచ్చెదనా !
ఎన్నాళ్ళకో!
చరణము లశ్రులఁ గడిగెదనా । కాటికొంగుచే ఒ ం
కరముల మెత్తగనొత్తుదునా । నాశిరమున భక్తి నిడేర్చుదునా!
ఎన్నాళ్లకో!

మహాప్రభూ :

సీ. సీనాంబరంబుల । చెలువొల్ల కిట్టి జే
గురుపాఁత దాల్చె నీ।కొఱకె యిటులు
తారహారంబుల।ద్వేజియించి తులసికా
సరులను దాల్చె నీ।కొఱకె యిటులు
భోజనాదిక్రియల్ । పోనాడి యుపవాస
గురుఖేద మెనసి నీ।కొఱకె యిటులు

సర్వాభిమానముల్ । చంపి నీపై మహో
న్నురభక్తి దాల్చి నీకొఱకె యిటులు

గీ. వేచియుంటి నిపుడు । వేంచేసితివి నీవు
కనులు సఫల మయ్యె! తనువు పూత
మయ్యె నాదుజన్మ । మతిధన్య మయ్యెను
విడిచిపోకు మయ్య? వేదవేద్య!

(అని పాదములను గట్టిగఁ బట్టుకొన నేల బోరగిలఁబడియుండుట నభి
నయించును.)

ఆఁ! ఆఁ! వెళ్ళుచున్నావా! మహాప్రభూ! నేను వదలుదునా!
(పాదములు పట్టుకొనఁబోయి ముందునకుఁ బడుచున్నది.)

మధు—అయ్యయ్యో! ఎంతపాపము; రాధా! రాధా!

రాధ—(లేచి పరుగెత్తును) కృష్ణా! కృష్ణా!—నన్నుఁ ద్యజించి పోకు!
నన్నుఁ ద్యజించి పోకు. (కేకలువేయుచున్నది)

మధు—అయ్యో! రాధ పరుగెత్తుచున్నది. నేను గలిసికొనలేక యుం
టిని. అయ్యో! ఓవనదేవతలారా! మిమ్ము నీరుబోసి పెంచి
నది—మీపల్లవములను గౌరవసూచకముగ శిరముపై ధరిం
చినది—మీవికాసములఁ గాంచి యుప్పొంగినది—మీపుష్ప
ములచేఁ దనమనోనాథుని పాదములకుఁ బూజచేసినది—మీ
పుష్పమకరందము తనయధరమకరందముతోఁ దనప్రాణప్రియు
నకు భక్తితోఁ గానుకనిచ్చినది—మీవృక్షములపై వ్రాలు
పక్షులకుఁ గృష్ణతారకనామ ముపదేశించినది—మీకిట్టియుప
చార మొనరించినది—అట్టి రాధాదేవి, పరమయోగినియై,
యున్మాదరూపిణియై, కాషాయమాత్రధారిణియై, నాకందకుం
డఁ బరువెత్తుచున్నది. ఓవనదేవతలారా! మీరీఁగెలచే దాని

కాళ్ళకడ్డుపడి యాఁపరాదా! కాషాయాంబరమును మీగొ-
మ్మలచే గ్రహించి నిలుపరాదా!

రాధ—పోకు పోకు. ఇదిగో వచ్చుచుంటిని. (పరుగెత్తుచున్నది.)

మధు—యమునానదీతీరమున నిశ్శంకముగఁ బరువెత్తుచున్నది. ఏమి
యుపద్రవము జరుగునో!

రాధ—(నవ్వుచు) ఆహా! ఆహా! కనఁబడితివా! మహాప్రభూ! మహా
ప్రభూ! ఇక్కడ దాఁగితివా!

మధు—అయ్యయ్యో! యమునానదిలోఁ బ్రతిఫలించినపూర్ణచంద్రు
ని శ్రీకృష్ణుఁడని భ్రమియించుచున్నదికాఁబోలు. అయ్యయ్యో!
ఏమి యుపాయము వచ్చునోకదా! (బిగ్గరగ నఱచుచు) అమ్మా!
అమ్మా! అతఁడు శ్రీకృష్ణుఁడు గాఁడు. చంద్రుఁడు. శ్రీకృష్ణుఁడు
నల్లనివాఁడు—నల్లనివాఁడు— నల్లనివాఁడు. భ్రమపడకు.
జాగ్రత్త. జాగ్రత్త.

రాధ—గీ. లోపలకుఁ జీఁకటిగఁ దోఁచు । లోకగురుఁడు
పరమదివ్యప్రకాశంబు । భక్తునకును
భక్తునకుఁ జీఁకటిగఁ దోఁచు । పాకజగతి
లౌకికునకుఁ దేజ మయి చెలంగుఁ గాదె?

కృష్ణా! కృష్ణా! కృష్ణా! (యని యమునలోఁ బడి నిమజ్జించును.)

మధు—అమ్మయ్యో! అమ్మయ్యో! ఇంకేమున్నది? ఇంకేమున్నది?
రాధ యమునలోఁబడి మునిఁగిపోయినది. ఏమి చేయుదును?
ఓనద్యధిష్ఠానదేవతా! నీవలెఁ బరమపవిత్రమైన రాధ-కృష్ణ
తాపము సహింపక నీలో దుమికినది. నీవు దాని కాపత్తు రా
కుండ రక్షింపవా? ఓకృష్ణదేవా! బాలలీలానుసారముగ య
మునలో నీవుంటి వని యందులోఁబడినరాధ నుద్ధరింపవా? ఓ
నదీతీరతపస్వులారా! పరమపూతమైనరాధను బైకిఁదీయరా?

ఆహా! ఆహా! (గుండెలు కొట్టుకొనును) ఇఁక నేమున్నది? అయ్యయ్యో! మితిలేనియనురాగము మృతికే కారణమయ్యెనా? అమితమైన దెప్పు డపాయకరిమే కదా! అక్కడ నెవఁడో తాపసి యున్నట్లున్నాఁడు. పోయి యాతనిని బ్రార్థింతును.

(నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.





శ్రీ

# రాధాకృష్ణనాటకము.



## పంచమాంకము.

ప్రదేశము:—మధురాపురములోని వీధి.

[ప్రవేశము:—తరళ.]

తరళ—ఇప్పటిస్థితికి మునుపటిదానికిఁ గావలసినంత భేద మున్నది. వెను కటిరీతిగానె యున్నయెడల మావంటివారికిఁ బ్రదుకవశమా! శారదా! శారదా! మాట.

[నేపథ్యమున] మాటకంటె పని ముఖ్యము గాన నేను రాను.

తరళ—ఇటురా! ఇటురా! ఇంతలో నంతతొందరపని యేమున్నది?

[నేపథ్యమున] ఇంతలో నంతతొందరమాట యేమున్నది?

[శారదుఁడు ప్రవేశించును.]

శార—తొందమాటలు, తొందరయాలోచనములు, తొందరపను లన్నియు మీదేవికిఁ జల్లారినవి కావా ?

తర—నేను నామాటయే యనుకొనుచున్నాను. ఆశ్చర్యమైనమార్పు కలిగినది. ఇది యింతకంటెఁ బూర్వమే కలిగియుండిన యెడల మేము సుఖపడి యుందుము.

శార—అటులు కలిగియుండినయెడలఁ బ్రిమాదమున్నది.
తర—అదేల ?
శార—అంతరకుసుమ మన్న నేమో నీ వెఱుఁగుదువా ?
తర—నాకుఁ దెలియదు.
శార—కంటిపాపలో నొకవిధమైనవ్యాధి. అది మీదేవి కున్నది.
తర—అబ్బే! ఆలిచిప్పవలె నేత్రిము లున్నయామెకు—
శార—అంతరనేత్రిమున కావ్యాధి యున్నది.
తర—ఐన నేమి?
శార—ఆకుసుమము క్రిమముగా నెదిగి కనీనికారంధ్రిమంతయు వ్యాపించి దృష్టిని సంపూర్ణముగఁ బాడు చేసినఁగాని దానికిశస్త్రి చికిత్సఁ జేయఁగూడదు.
తర—చేసినయెడల ?
శార—కన్ను సున్నగును.
తర—ఐన నేమి ?
సార—ఏమియు లేదు. నిరాకారజపమునకువలె గాంధాంధకారదర్శనమని.
తర—నాయభిప్రాయ మది కాదు. ప్రస్తుతాంశమున కిది యెట్లు సందర్భింపఁజేసెదవు ?
శార—అటులే. గర్వప్రాయశ్చిత్త మాగర్వముయొక్క లేఁతదశలో జరుగఁగూడదు. అందులకే, శ్రీకృష్ణుఁ డామెగర్వము నెదుగనిచ్చి యెదుగనిచ్చి తుదకు శిరస్తాడనఫలమును గాంచి యిప్పటికి ప్రాయశ్చిత్తాన్నపరిపాకము గలిగినదని యెంచి దానిభంగముచేయుటచే నిప్పు డామె కొంత శాంతచిత్తురాలైనది.
తర—కాని, బృందావనములో సత్యభామ యున్నంతవట్టు గర్వభంగమైనట్లు కనఁబడ లేదేమి?

శార—శస్త్రవైద్యపుఁబచ్చి మానకుండునే?

తర—ఈ మెప్రకృతి మాటినట్లే తోఁచుచున్నది.

శార—చెక్క తోఁతుగాఁ దీసి గండ్రయుప్పుచేఁ బఱరాచి నీళ్ళు వోసి కడిగినప్పటికి ననాసపండు మరదపోవునా? ప్రయత్నమునఁ బ్రకృతి యడఁపఁబడును గాని మార్పఁబడునా?

తర—ఏమో కాని, శ్రీకృష్ణుని దర్శించినప్పటినుండియు నా మెకుఁ జాల పశ్చాత్తాపము గలిగినట్లున్నది.

శార—సత్యభామ వెట్టి కాని, యాగ్రహవాక్యములచేతను, బఱఁద న్నుటచేతను, గాంతునియందురాగము హెచ్చునా? సుగంధతైలమును రాచి దువ్విన జుట్టెనుగును గాని పడలాగిన నెనుగునా? కాని రాధపై నామె యంతఃకరణ మెటు లున్నది ?

తర—ఉదాసీనముగ నున్నది. చూడు! సిగ్గు విడిచి యడుగుచున్నాను. రాధ యనుపయుక్తుఁడైన బాలకృష్ణుని వలచుట యేల ?

శార—మొప్పువంకాయ కున్నరుచి ముదిరినదాని కుండునా ?

తర—శారదా! పరిహాసము సేయకుము. మీదేవికి నీయనుమానము విశేషముగా బాధించుచున్నది. -నన్నెన్నిమాఱు లడిగినను నేను దగినసమాధానముఁ జెప్పలేకపోయితి. అందుకొఱకు ని న్నడిగితిని.

శార—ఈసంగతి శ్రీకృష్ణునకే తెలియుదని నాయభిప్రాయము.

తర—ఆఁ! ఆయనకుఁ దెలియకేమి? ఆయన దేవుఁడఁటే?

శార—ఆ, ఆ, దేవులచేత దెబ్బలుతినుటకు—

తర—అబ్బా! పరిహాసోక్తికి యేల? నేనడిగిన యీప్రశ్నముల కుత్తరము నాకుఁ దెలియవలెను.

శార—తెలియుట కొక మార్గమున్నది.

తర—అదేది?

శార—పోయి రాధ నడుగుము.

తర—చాలు.

శార—చాలును గనుక నేను పోయెదను. నామిత్రుము నాకొఱకు వార్త నంపినాఁడు.

తర—మహారాజుగారును, మాదేవియు, నే నిక్కడకు వచ్చుసరికే మాటలాడుచుండిరి.

శార—అలాగా? పనికిమాలినమాటలతోఁ గాలము వ్యర్థముఁ జేసితి విగదా! నే నిప్పుడైన వారియొద్దకుఁ బోవలెను.

తర—నే నింటికిఁ బోవలెను సెలవిమ్ము.

శార—సరే.

(ఇద్దఱును నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

ప్రదేశము:—మధురాపురములో సత్యభామాంతఃపురము.

[ప్రవేశము:—కృష్ణుఁడు, సత్యభామ, శారదుఁడు.]

సత్య—చెప్పరాదా? చెప్పరాదా?

కృష్ణ—పోనిమ్ము నీ కెందులకు!

శార—మిత్రమా! నేనుఁగూడ విని సంతసింతును.

సత్య—మీరు నాయందు దయయుంచి చెప్పవలెను. "హా! యెంత ప్రమాదము! కాని నీకేమి భయము లేదు." అని యీమధ్య మున మీరు నాప్రక్కనుండి యదరిపాటున లేచి యెందులకు బిగ్గరగఁ గేక వేసితిరి?

కృష్ణ—ఒక భక్తశిఖామణి యమునలో నాకస్మికముగఁ బడినటులు నాకుఁ గనఁబడెను.

సత్య—అయ్యయ్యో! పాపము మృతి నొందలేదుగద!

కృష్ణ—లేదు.

శార—పతిబాధఁ బడలేనిపడఁతివలె భక్తశిఖామణి నీటిలో నేల దుమికెను?

కృష్ణ—పతిని జేరుటకు.

శార—పతి యంతకుముందే యమునలోఁ బడినాఁడా?

కృష్ణ—జగత్పతిని జేరుటకు.

శార—జగత్పతి యమునలో కాని లేఁడా?

కృష్ణ—అప్పటి కాభక్తరత్నమున కాతఁడు యమునలోఁ గనఁబడెను.

సత్య—ఆభక్తుని పేరేది?

కృష్ణ—పేరు వదలి, యూరు వదలి, సర్వమునుగూడఁ బరిత్యజించి కాషాయాంబరమునుమాత్రము ధరించిన యొకవ్యక్తి.

సత్య—అట్టిమహామూర్తిదర్శనము సర్వాభీష్టప్రదాయకము గానఁ దద్దర్శనలాభమును మీరు నాకు గలుగఁజేయవలెను.

శార—అమ్మా! నే నేమైన నడ్డు చెప్పిన మీకుఁ గోపమని సంకోచించుచున్నాను గాని, యతులలోఁ దఱచుగఁ బైవేషమునకను గుణమగు నంతరంగస్వరూపము గానఁబడదు. యతినింద దోషమే కాని, యథార్థాచ్ఛాదనము దోషతరమని యట్లు చెప్పితిని.

సత్య—శారదా! నీనోటివెంట నెన్నఁడును మంచిమాట రాదుగదా!

శార—నాకు గర్వప్రాయశ్చిత్తము కాలేదా?

సత్య—(తనలో) ఈనిర్భాగ్యుఁడు నన్నధిక్షేపించుచున్నాఁడు. అబ్బా! సహనముకంటెఁ గష్టతరమైనపని లేదుగదా! (ప్రకాశముగా) నాథా! ఆభక్తాగ్రణిదర్శనము నాకు లభింపఁజేయరా?

కృష్ణ—అలాగే.

సత్య—ఎప్పుడు?

కృష్ణ—ఇప్పుడే.

సత్య—నాథా! నాకు భక్తియోగ ముపదేశింపరాదా?

శార—(తనలో) నేనుగవిత్వమును నేర్చుకొనిన నెంతలాభమో నీకు నంతే.

కృష్ణ—నీ కాతరుణభక్తశిఖామణిసన్నిధిని నారదునిచే నుపదేశింపఁ జేయుదును.

శార—అదే మంచిపని. భర్తయుపదేశము బ్రాహ్మణవ్యవసాయము వలె నిష్ఫలము.

సత్య—నాథా! భక్తికిఁ బ్రధానముగఁ గావలసిన దేది?

కృష్ణ—మిత్రమా! నీవు చెప్పుము.

శార—భక్తికి బ్రధానమైన దేదో నే నెఱుఁగను గాని విరక్తికిఁ బ్రధానమైన దేదో నే నెఱుఁగుదును.

కృష్ణ—(నవ్వుచు) ఏదో చెప్పుము.

శార—చెప్పనా? ఆనపకాయ. రక్తికి బ్రధానమైనదిగూడ నీ యానపకాయయే.

కృష్ణ—(నవ్వుచు) అదెటులు?

శార—సంపూర్ణ హృదయానురక్తి గలవీణెమెడలో నానపకాయ; సంసారవిరక్తిగల సన్న్యాసిచేతులో నానపకాయ.

కృష్ణ—

గీ. అనిలవశమున నాదునామామృతరసములఁ
బలుకువీణెను నొకచేతఁ బట్టి యొక్క
చేత స్ఫారకాయబుఱ్ఱను జేర్చి యడుగో!
నారదుఁడు భక్తిగానవిశారదుండు.

సత్య—(సంభ్రమముతో) ఏరీ?

శార—నాకుందరఁగూడ విశారదుఁడా? ఆమాట యసత్యము.

సత్య—ఛీ! మందుఁడా! పూజ్యుల నధిక్షేపించెద వేల?

శార—(తనలో) తన్నుటకంటె మేలుకాదా? (ప్రకాశముగా) నా యెదుట నారదుఁడు విశారదుఁడు గాఁడు. నశారదుఁడు.

సత్య—చాలు తెలివి తెల్లవారినట్లె యున్నది.

కృష్ణ—ఎవఁడురా అక్కడ?

[నేపథ్యమున] అయ్యా!

కృష్ణ—నీవు పోయి ద్వారమునొద్ద వేచియుండు నారదమునీంద్రుని లోనికిఁదీసికొని రా!

[నేపథ్యమున] చిత్తము.

[నారదుఁడు ప్రవేశించును.]

నార—సీ. నందనందన! సచ్చిదానందరూప!
భవజలధితారకా! భక్తపారిజాత!
ఉపనిషత్తీరనవనీత! యోగయోగ
గాత్ర! మధ్యమలోకభాగ్యంబ! జయము.

కృష్ణ—మహానుభావా! నమస్కారము.

నార—జయము. జయము. యాదవకులభూషణా!

సత్య—మునీంద్రా! నమస్కారము.

నార—సుమంగలీభవ.

శార—మహాత్మా! నమస్కారము.

నార—కళ్యాణమస్తు.

సత్య—(అపవారించి) నాథా! భక్తుఁడేఁడీ?

కృష్ణ—(అపవారించి) సత్యభామా! చూడకున్నంతవఱకే సంభ్రమము. చూచినతరువాత సంకోచమేమో?

సత్య—(అపవారించి) నేనంత మూర్ఖురాలనని మీయభిప్రాయమా?

కృష్ణ—(అపవారించి) సరే. చూచెదముగాక. (ప్రకాశముగా) మునిచంద్రా! మీరందఱు క్షేమముగ నున్నారా?

నార—తమకటాక్షమువలన—మహానుభావా !

గీ. అఖిలవస్తుసంతతి నీదె । యందులోన
నది మఱెంత నీదియో భవత్పదపయోజ
భక్తురా లొంటచే దైన్యభావ యగుట
నంతకంటె నీదె గ్రహింప । వయ్య! దాని.

సత్య—(అపవారించి) నాథా! భక్తుఁడు కాఁడా? భక్తురాలా?

శార—(తనలో) సంధానకృత్యము నన్నువిడిచి నారదునిజేరినట్లున్నది.

కృష్ణ—మునిశిఖామణీ! భక్తురాలి నిటకుఁ దీసికొని రావచ్చును.

నార—ఎవఁడురా అక్కడ ?

[నేపథ్యమున] స్వామీ!

నార—ద్వారమునొద్ద నొకశిష్యుఁడు నొక కాంతయు నున్నారు వారిని లోనికిఁ దీసికొని రమ్ము.

[నేపథ్యమున] చిత్తము.

కృష్ణ—సత్యభామా! "భక్తుఁడు కాఁడా? భక్తురాలా?" యనియడిగితివి.

గీ. వర్ణలింగనామాకృతి । ప్రముఖభేద
ములు బహి స్తనువునకె తజ్జ్ఞడసుఖముల
విడుచుభక్తున కవి లేవు । వివిధభేద
ములు సుమములకె మకరంద । మునకు లేవు.

[మునిబాలకుఁడు రాధతోఁ బ్రవేశించును.]

రాధ—హా! రాధాకృష్ణా ! (మూర్ఛఁబోవుచున్నది.)

కృష్ణ—(రాధయొద్దఁ గూర్చుండి)

గీ.తమమునం దుండునరుని నేత్రము లోకపరి
వెలుఁగుఁ గని మూసికొనినట్లు । విరహవివశ
మైనదీనిచిత్తము నన్ను । నట్టె చేరఁ
దిరిగి వివశత నొందెను । దేవమాని.

నార—మహానుభావా! ఈమెచిత్తము, నేత్రములు, నిన్నిదివఱకే చేరినవి. చంద్రునిఁ జూచి నీవని భ్రమించి యమునలోఁ బడినది. హంసికవలె నానదీప్రవాహమున నీమె పోవుచుండఁగా నేను గాంచి యీముని నీఁదికొని పోయి పట్టుకొనుమని చెప్పితిని. "నాబాలకృష్ణుఁ డిచ్చట నున్నాఁడు. నేను రాను." అని యీమె కేకలు వేయఁగ బలాత్కారముగ నితఁడే యొడ్డునకుఁ దీసికొనివచ్చినాఁడు.

కృష్ణ—ఓమునిబాలకా! నీవు నాకు మహోపకార మొనర్చితివి.

మునిబా—స్వామీ! దాసుఁడను. కటాక్షింపవలెను.

శార—నారదమునీంద్రా! ఈ బాలయతికిఁ గమండలువు లేదేమి? ఇంచుగాఁగమయతివలె నీతఁ డపాత్రయతియా యేమి?

సత్య—(తనలో) నామనస్సు కరఁగుచున్నది. రాధాదర్శనమువలన నేననిర్వాచ్యమైన యొకమనస్థ్సితిని బొందుచున్నాను. ఆహా! ఈమె పరమధన్యవలెనున్నది. ఐహికము లన్నియుఁ ద్యజించిన పరమభక్తురాలు. ఇట్టిమహాపతివ్రతదర్శనముఁ జేసి నేను కృతార్థురాల నైతిని.

కృష్ణ—రాధా! ఇంకను లేవకున్నా వేమి?

గీ. నాకొఱకు నీవు పడినట్టి । భీకరోరు
కష్టసంఘంబులకు నేను । గాంత! నీకు
ఋణముఁ దీర్చుకొనఁగలేను । ప్రీతినీదు
సన్నిధి వశుఁడ నగుదు శాశ్వతము గాఁగ.

(రాధ లేచును.)

సత్య—రాధా! నమస్కారము. నేనిదివఱకు నీస్వభావము నెఱుఁగనిదాననై నీయెడలఁ దప్పుఁ జేసితిని. నన్ను క్షమియింపుము. నీవు నానాథు నెటులు ప్రేమించితివో యట్టిప్రేమ నాకుఁ గూడ నుపదేశింపుము. (సాష్టాంగపడును.)

రాధ— చెల్లెలా! లెమ్ము. మనమిద్దఱమీమహానుభావునిఁ గీర్తింతము.

రాధ-సత్య— కృష్ణ! కృష్ణ! శ్రీకృష్ణా! కృష్ణా! కృష్ణా!కృష్ణా!కృష్ణా!

(పాడుచుఁ గృష్ణునకుఁ బ్రదక్షిణము జేయుచున్నారు.)

నార— సత్యభామా! నీవు మహాదృష్టవంతురాలవు. చిరకాలశ్రమమునఁగాని యభ్యసింపనేరని యీభక్తియోగము భక్తాగ్రేసరయగు రాధసంస్పర్శమున నీకిట్టె లభించెను.

గీ. సమిధలను దఱచి తఱచి । శ్రమముఁ జేసి
యగ్నికీల నొందెడునటుఁ । దట్టి కీల
నట్టెయొసఁగు వేఱొక్కఁప । దార్థమునకు
భక్తి యటులు నీ కిచ్చె నీ । భక్తవర్య. —

గీ. బోఁటి! నెఱనున్న వర్ణసం । పుటితమైన
గాని నోటను బలుకఁగా । రానియటులు
నిర్గుణము కేవలము మనో । నియతితోడఁ
దలఁప నెవ్వరికైన సా । ధ్యంబు గాదు.

గీ. వ్రణమహావ్యాధిపీడను । బడఁగ లేక
వెజ్జొసఁగుమత్తుఁ గొని త్రావి । విస్మృతుఁ డయి
లేచి దివ్యౌషధము బాధ । లేమి యీత
వఱకు సిద్ధించె నని పల్కు । వ్రణితుఁడటుల.

గీ. నిర్గుణబ్రహ్మసంధాన । నిష్ఠనుండఁ
దలఁచి యస్వప్నగాఢని । ద్రను లభించి
విపులకయ్యానసమాధిని । విడిచి తపసి
“యయ్యొ నద్వైతసిద్ధి మా” । కనును గాదె.

గీ. జ్ఞానమాత్రమె ముక్తికిఁ । గారణంబు
గాదు; షట్పరిపంథిని । గ్రహము వలనఁ

గాని జ్ఞానము గలుగదు । జ్ఞానమునకుఁ
గాక దన్మహాశతుర్నిగ్రహము గాదు.

గీ. ఏమిసేయవచ్చు । నీయసాధ్యపుసంధి
యందు భక్తియోగ । మమరకున్న
భక్తిలేనిజ్ఞాన । పరిపాకమే లేదు
భక్తిలేకయున్న । ముక్తిలేదు.

గీ. భక్తియోగాధికత నీవ । ప్రపంచమందు
లక్ష్యముగఁ జూపి మోక్షఫ । లంబు భక్త
తతికొసంగ లోకగురుఁ డవ । తార మొందె
నిడుగో! సర్వమంగళగుణా । కృతిని దాల్చి.

గీ. ఈమహాతపస్వత్సర । మీశ్వరుండు;
భార్యలగు మీర లష్టవై । భవము లగుదు
రిలను పదునాఱువేలవే । ల్పులును జీవ
సంఘమందు త్తమోత్తమ । జన్మరాశి.

గీ. ఈమహాసాధ్వి కితనిపై । నెనయురాగ
మైహికానందాకర్షా । వాంఛాన్వితంబు
గాదు; పరమాత్మయందు రా । గప్రపూర్ణ
జీవునకు సంబంధసిద్ధి గాని.

గీ. వివిధజీవుల కిలనుండు । వివిధబంధ
రాజిఁ బతిసతీబంధమే । ప్రబలతమము
జీవుఁ డారీతి సగుణుఁ బు । సేవఁ జేయ
ముక్తి సులభతరంబుగాఁ । బొందు గాదె.

గీ. ఏతదనుబంధయుక్తభ । క్తిద్ధయోగ
మిలను స్థాపించి మనలకు । నిప్పుడైన

బుద్ధిగలుగఁగ రాధికా । పుణ్యచరిత
మితఁ డిపుడు నాటకముగ నాడించినాఁడు.

శార—(తనలో) ఋషులకైనఁ బ్రమాదము తప్పదు; నాటకమాడించినాఁడా? తానుగూడ నాడినాఁడా? తప్పు. నారదునితప్పు శారదుఁడు పట్టుకొనవలెను గాని మఱి యెవ్వఁ డందులకు సమర్థుఁడు.

నార—రాధా! కృష్ణవిలాసదర్శనమున కనేక కాంతలుఁ బురుషులు వచ్చియున్నారు. వారందఱికి నేత్రపర్వములుగ నుండుట కొఱకు మీ రీగవాక్షమునొద్ద నిలువఁబడుఁడు.

కృష్ణు—(రాధపై నొకచేతిని, భామపై నొకచేతి నుంచి యట్లు చేయును.)

నార—రాధాకృష్ణాలోకనలాలస లగునో కాంతలారా!

గీ. ఉండఁదగునంచు లేదంచు । నుండిలేద
టంచు లేని దున్న దటంచు । నన్ని వెట్టి
పోకలను బోవు తలతిక్క । బుద్ధి మీకుఁ
గలుగ దురుగర్వ లగుపురు । షులకె గాని.

గీ. అమృతపూరాభములు హృద । యములు మీక
గాధగాఢానురాగసం । కాంతములను
రాగపరిణామమే భక్తి । రమణులార!
భక్తి మీజన్మవశమున । బైటమాట.

గీ. అనుభవముఁ బత్యనురాగ । మన్న నేదొ
మీకుఁ దెలియునుగాన నీ । లోకకాంతుఁ
గాంతుగా నిట్టె భావింపఁ । గలరు మీర
లిటులు భావించి వేగఁ దరింపఁగలరు.

గీ. భక్తులైన మీవెంట మీ । పతులఁగూడ
నుద్గతుల మీరు పొందఁ జే । యుదురుగాక
యూర్ధ్వదృష్టియా దీపిక । నూర్ధ్వమునకె
కాగితపుబుట్ట గొనిపోవు । కరణిఁ గాఁగ.

[నేపథ్యమున]

స్వామీ! రాధాకృష్ణ వైభవమును గన్నులారఁ జూచుట కిచ్చటకు వచ్చెదమని రుక్మిణీదేవిగారు మొదలగు పూజ్యులగు దేవులందఱును దమతో మనవిచేయుమనినారు.

కృష్ణ—రుక్మిణీదేవికి నే నంతశ్రమ నిచ్చెదనా? మేమే లోనికివచ్చి యామెను దర్శింతుమని చెప్పుము. పొమ్ము. మునివర్యా! మత కింక నిక్కడఁ గావలసిన దేమున్నది?

నార—మీదర్శనమున నందఱమును గృతార్థులమైతిమి. ఐననిటుల గోరెదను.

గీ. ధరణి యీతిబాధలు లేక । తనరుగాక
ప్రజలయన్యోన్యవైరముల్ । పాయుగాఁక
కవిత రాజపోషణమునఁ । గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు । నెగడుఁగాక.

కృష్ణ—తథాస్తు. (అందఱును నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

సమాప్తము.

---

# నలభీమపాకశాస్త్రము.



ఈ నలభీమపాకశాస్త్రము అక్షరజ్ఞానము కల ప్రతిస్త్రీపురుషులకు చక్కఁగా బోధగునటుల సులభమైన పదములతో విశదముగా నుండిన యీగ్రంథమును గాంచి మిక్కిలి కుతూహలురై, జీవాత్మ సంతసించునటుల రుచికరము లగుకూరలు, పచ్చడులు, చారులు, ఊరగాయలు, పిండివంటలు మొదలగు పదార్థములు చేయుక్రమ మెఱింగి సుఖింతురని నమ్ముచున్నాము. సాధారణముగా కొందరి గృహములలో ఉప్పు, కారము, సువాసనద్రవ్యములు, దేని కెటులవేయవలయునో, యెఱుంగక పదార్థములు భుజించుటకు వీలులేకుండునటుల పాడుచేసి నిందలబడువారిని మన మనేకమందిని గాంచుచున్నాము. మఱియు నేవిధమైన రుచిగల పదార్థముల భుజించుట కాశయము గలిగినప్పటికి చేయువిధము తెలియక విఫలమగు మనోరథముతో నిరుత్సాహపడి చేయనొల్లమిఁ ఆపని మానుకొనుచున్నారు. కాబట్టి ఈ పాకశాస్త్రమును పఠించి చేసేవిధములు గుర్తుంచుకొని ఆంధ్రసతీమతల్లులు అబ్బురముగా అరవైఆరు పిండివంటలు, ముప్పదిమూడు పచ్చళ్లు రుచి తప్పకుండా జేసి తమయజమానుల మెప్పును బడసి, నిత్యకృత్యములుగా నెగడబడు అన్నము, పులుసు, చారు మొదలగు పదార్థములకు లేనిరుచి కల్పించి తాము సంతసించి, తమతోడివారు మెచ్చ, బాహాటముగా నీగ్రంథమును పైకిదెచ్చి సవిమర్శముగా వాడినచో చాలకాలమువరకు వాడినచో భర్తచే చీవాట్లు, కొడుకు కోడలి వగింపులు, ముసలివారి ముచ్చట్లవలన కక్కుఱ లేకుండా గృహకృత్యములలో పెద్దల మెప్పును పొంది గొప్పగా తమకుటుంబమును నేర్పు బుచ్చఁగలరు. వెల రు 1—0—0.

---

కొండపల్లి వీరవెంకయ్య, బుక్సెల్లరు, రాజమండ్రి.